సరస్వతీ గ్రంథమండలి : అనుబంధమాలిక : ౧౨

# లలిత

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., బి. యల్.,



సరస్వతీగ్రంథమండలి
రాజమహేంద్రవరము

---

౧. ఇందు జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా ౦—౪—౦ లు చెల్లింప వలయును.

౨. ఇందు రెండేసిమాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాటలాగులోనుండు గల ప్రతిగ్రంథమును రు ౧—౦—౦ వెలకు జందాదారులకుఁ బంపు చుందుము.

౩. గ్రంథములఁ బంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

౪. చందాదారు లగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొనవలయునను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములుకూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొను చుండవలెను.

౫. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

౬. సంవత్సరము చందా—అనగా ముందు ప్రకటింపబడు ఆఱుపుస్తకములకు ౭-౨-౦ లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజిష్టర్డు పార్సిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లించవలసిన మనియార్డరు కమీషను ౦-౧-౨-౦ లు రిజిష్టరు ఖర్చు ౦-౧-౨-౦ లును రు ౧-౮-౦ లు కూడివచ్చును.

# లలిత

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., బి. యల్.,



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

*** అంకితము ***

యశస్తిలకులును, పూజనీయులు నగు



వేమవరపు రామదాసు పంతులు గారికి

జనకుఁడు దివంగతుఁడైన కతిపయ దినములలోనే ఏదో మాట పట్టింపుపై పినతండ్రి మణిశంకరునకును చంద్రనాథునకును వివాదము వాటిల్లెను. అందుచే అనుజుని శ్రాద్ధసమయమున చుట్టములు వచ్చినపుడు మణిశంకరుఁ డొకటి రెండు అశ్రుబిందువులు రాల్చి అగ్రజునకు ధర్మోదకములువీడి శ్రాద్ధకర్మయందు పాల్గొనినను, చంద్రనాథుని యింట విస్తరి వేయక తనవారి నెవరినట్లు చేయనీయక తన తావున తాను ముకుళితవదనుఁడై కూర్చుండెను. బ్రాహ్మణులు భోజనమొనరించి లేచిన పిదప చంద్రనాథుఁడు పినతండ్రి పాలిటి కరిగి చేతులు జోడించి "చిన్నబాబయ్యా! దోషమంతయు నాదియే మీరు నాకు పితృసమానులు—నేను మీకు పుత్రస్థానీయుఁడను. ఈమాఱు నాతప్పు సైరింపుడు." అని దీనాననుండై పల్కెను.

"నాయనా! నీవు కలకత్తా మహానగరమునందుండి బి. ఏ., ఎం. ఏ., పరీక్షలందు కృతార్థుఁడవై విద్యావంతుఁడవును బుద్ధిమంతుఁడవును నైతివి. ఇఁక నేనంటివా—పూర్వకాలపువాఁడను. వట్టి మూర్ఖుఁడను. నీకును నాకును సరిపడుటెట్లు? వేరుకోసి యింక వెన్నున నీరుపోయు ప్రయత్నమెందుకు?" అని జనకసముఁడైన మణిశంకరుఁ డనెను.

పినతండ్రి నిష్ఠురుఁడై తన వేడికోలును ద్రోసిపుచ్చుట వలన తాను వేఱె యుండవలెననియే తుదకు చంద్రనాథుఁడు నిశ్చయించుకొనెను. ఆతని తండ్రి బ్రతికియున్నపుడు కూడ అన్నదమ్ము లిరువురియందు విశేషహృద్యతయుండలేదు. కాని సమిష్టి కుటుంబమున కలిసి కుడుచుటకు వారు సంశయింపలేదు. ఇప్పు డది చెడినది. చంద్రనాథుని జనకుఁడు మిగుల ప్రజ్ఞావంతుఁడు. విశేషవసతి సంపాదించి అతఁడు దివంగతుఁ డయ్యెను. పిన్నతనమందే చంద్రనాథుని జనయిత్రి బరలోక గతురాలయినది. అందుచే సమీప బంధువు లెవ్వరును ఇంట లేరు. రెండవపెండ్లి పెండ్లామును గొని మేనమామ మాత్రము వచ్చి చంద్రనాథుని గృహమున విడిసినాఁడు.

పరామర్శకై వచ్చిన చుట్టములు వెడలిపోయిన పిదపఁ జంద్రనాథుఁడు తనయొద్దనుండు ప్రధానోద్యోగిని పిలిచి "సోదరా! ఇల్లువదలి యేదేని దూరప్రదేశమున కరిగి కొన్ని దినములు వసింపవలెనని వాంఛించుచున్నాను. జనకుఁ డున్నప్పటివలె వ్యవహారములను జాగ్రత్తగఁ జూచుచుండుము. నేను మరలి వచ్చుటకు ఒకవేళ ఆలస్యమైనను, నేనున్నట్లే భావించి జమీందారీ వ్యవహారములన్నిఁటిని జక్కబెట్టుచుండుము." అని చెప్పెను.

అప్పుడచటనేయుండి యీ మాటల నాలించిన చంద్రనాథుని మేనమామ వ్రజకిశోరుఁడు "నాయనా! ఈ సమయ

మున నీవు ఇల్లువిడిచి ఎచటికినిపోరాదు. నీ మనసు చింతా కులమై యున్నది. నీ విప్పుడు ఇంటినే కనిపెట్టుకొని యుండ వలెను" అని మేనల్లు నుద్బోధించెను.

కాని చంద్రనాథుఁడు మామమాటలను చెవిని బెట్టలేదు. జమీందారీ వ్యవహారముల భారమునంతయు గుమాస్తాపైనను గృహవిషయముల భారమును మాతులమీఁదను నుంచి యతఁడు వేషవిన్యాసము లేమియులేకుండ సామాన్యమాన వునివలె ఒంటరిగఁ బయనమై పోయెను.

అతఁడు నిష్క్రమించిన పిదప, వ్రజకిశోరుని సతి చప్పున పతిచెంతకు వచ్చి రహస్యముగ నాతని చెవిలో "ఊరకనే పోని చ్చితి రే? మీకు అంతమాత్రపు ఆలోచనయైన తట్టలేదా?" అనెను.

"ఏమి యాలోచన?"

"ఇల్లు వదలి అతఁ డే దేశమో లేచిపోయెనుగదా!— మంచిమాటలచే ఒక వీలునుక్క వ్రాయించి ఏల పుచ్చు కొన్నారుకాదు? మానవప్రాణము ఎంతటివానికైన ఏఘడియకు నేమివచ్చునో చెప్పఁగలమా? కర్మము చాలక కాని దేశ ములలో నతని కట్టిగతియే తటస్థించిన మీకు, నేను సలబడుట ఎచట? కావలసినవారము మనము కాకపోతే ఆ స్తికి ఇత రులు హక్కుదారులు కావచ్చునా? ఈ పాటి యాలోచన మీ కాడది వచ్చి చెప్పవలెనా?"

"ఛీ! పాడురండా! ఇట్టిమాటలాడవచ్చునా? ఇంత వెం

గలితనము వెలిబుచ్చుదువని నే ననుకొనలే" దని పతి గడసరి పెండ్లాము నించుక కసరెను.

కాని ఆమె చెప్పినమాట నిజమని బ్రజకిశోరుఁడు అర్ధాంగి కృపవలన మూఁడు నాలుఁగు దినములలో పూర్తిగ గ్రహింపఁ గలిగి తన యవివేకమునకు మిగుల పరితాపపడఁజొచ్చెను.

ఏడాదిపాటు 'చంద్రనాథుఁ డొంటరిగ ననేకప్రదేశములుతిరిగెను. అనంతర మతఁడు గయ జేరి జనకుని సాంవత్సరిక శ్రాద్ధము నందునిర్వర్తించెను. ఇంటికి మర్లవలెనను వాంఛ లేనందున, నతఁడు వారణాసిపురమునఁ గొంత కాలముండఁదలఁచెను. కాశీయందు యాత్రికుల నాహ్వానించి శ్రాద్ధకర్మలను జేయించు 'పండా' బ్రాహ్మణులలో నొకఁడు చంద్రనాథునకు పరిచితుఁడుగలఁడు. ఒకనాఁడు పగలు రెండు జాములవేళ చేత నొకరైలు సంచిఁగొని చంద్రనాథుఁడు పరిచితుఁడైన హరిదయాలుని గృహమున కరిగెను. కాశీ చంద్రనాథుఁ డెఱుఁగని పట్టనముకాదు. ఇంతకు మున్ను జనకునితో కొన్నిమాఱు లతఁ డచ్చోటికివచ్చియుండెను. హరిదయాలుఁడు నిముసములో చంద్రనాథుని గుర్తించెను. అతని యాకస్మిక యాగమనమున కతఁడించుక విస్మయంపడినను, గయ నుండి నున్నని మొగమున నాతఁడు వచ్చు టెఱిఁగి, శ్రాద్ధ వృత్తియందు పారంగతుఁడగుటచే నిముసములో నాయువకుని కాపాదించిన విపత్తును గ్రహించెను. తనరొట్టె నేతఁబడెనని అంతరంగమున నుబ్బి, అప్పటికతఁడు పిండప్రదానముమాట

యెత్తక "అయ్యా! ఇష్టము వచ్చినంతకాలము మీరు మా యింట నుండవచ్చు" నని మేడమీఁది గదియొకటి చంద్రనాధుడుండుటకు ఏర్పాటుచేసెను.

చంద్రనాధుని గదినుండీ, యావలి మూలకిటికీ గుండా లోపలి వంటగది ఇంచుక కానంబడును. పలుమాఱాతడావాతాయనముగుండా పచనాగారములోనికిఁ దొంగి తొంగి చూచుచుండువాఁడు. వంటయింటి తినుబండముల యెడ మక్కువచే నతఁడట్లొనర్చుటలేదు. వంటచేయువారి నీక్షించు కోరికయే యందులకు హేతువు.

వంటకత్తియు వితంతువు. సుందరి. కాని యామె మోము దుఃఖాధిక్యతచే వాడిపోయినట్లున్నది. ఆమె సదా మఱుఁగున మసలుచు, ఎవరికిని దెలియని లాగున నిర్దిష్టకృత్యములు నలుపుచుండును. పదేండ్ల బాలికయొకర్తుక ఆమె చెంగట వసించుచు, వంటకు వలయువస్తువుల నవసరము గుర్తించి ఆమె కందించుచుండును. అతృప్త నయనుండై యువకుఁడా బాలిక సోయగమును విలోకించుచు మిగుల భ్రమసిపోవుచుండువాఁడు.

కతిపయ దినములవఱకు వితంతువు చంద్రనాధుని దృక్పథమున బడకుండఁగనే మసలుచుండెడిది. వంట ముగిసిన పిదప విస్తరియందు దాహార మిడికొనివచ్చి యతని గదియందిడి పోయెడిది. కాని క్రమక్రమముగ కొంతకాలమున కాబిడియ మామెను వదలిపోయినది. చంద్రనాధుఁడు వయసున మిగులఁ జిన్నవాఁడు. పిన్నవయసునకుఁ దోడు పరిచయము

కూడ వృద్ధియయినది. అందుచే ననంతరమామె జనయిత్రి వలె చంద్రనాథుని చెంతఁ గూరుచుని అతనికి వలయు ఆహార పదార్థములను గుడువఁ బెట్టుచుండెడిది.

చంద్రనాథునకు పిన్నవయసునందే తల్లి కలువగుటచే మాత నాతఁడు పూర్తిగ విస్మృతించెను. జననిని గోల్పోయినదాది తండ్రిచేతులందే ఆతఁడు పెఱిగి పెద్దవాఁ డాయెను. తల్లియుఁ దండ్రియుఁ దానయై యతని జనకుఁ డతని నల్లారు ముద్దుగ బెంచినను, స్త్రీ సులభకోమలానురాగము నాతఁ డంతగ సూపఁజాలకపోయెననియే చెప్పవలసివచ్చును.

జనకుఁడు పరమ పదించిన యనంతరము చంద్రనాథుని హృదయకుహరమున వెలితి వడిన తా విపుడు పూర్ణమగుట యేగాక అభినవమాతృప్రణయ రసమున వెల్లి విరిసిపోయినది.

ఒకనాఁడు చంద్రనాథుఁడు హారిదయాలుని సంబోధించి "మీకు సన్నిహిత బంధువు లెవరును లేరని యెఱుఁగుదును. ఈవితంతు వెవ్వరు?" అనియెను.

"ఆమె నాకేమియుఁగాదు—జాతి కామె విప్రాంగనయే."

"వీ రిరువురు మీ కెక్కడ లభించిరి?"

"అగాధ చాల యున్నది. సంక్షేపముగఁ దెలుపుదును. మూఁడేండ్లకు మున్నామె పతిపత్నీతనూభవలఁగూడి తీర్థయాత్రకై ఇచటి కరుదెంచెను. కాని పాప మాతఁడు వ్రోడనే కాశీక్షేత్రమున పంచత్వము వడసెను. తిరిగి నిజసీమ కరుగుదమనినను ఆయభాగుల కందాత్మీయు లెవ్వరును లేరు.—

తదుపరి వారి యవస్థను మీరు కన్నులారఁ గాంచుచునే యున్నారు.''

"వీరు మీయింటి కెట్లు విచ్చేసిరి?"

"మణికర్ణికా ఘట్టముయొద్ద బాలిక బిచ్చమెత్తుటఁ జూచి జాలిఁగొని ఇచటికిఁ గొనివచ్చితిని.''

"వా రేతావువారో అడిగి చూచితిరా?"

"అడిగితిని గాని వివరములు మఱచితిని.—నవద్వీపమునకు సమీప మందలి ఏదోపల్లె వారివాసస్థానమని జ్ఞాపకము.''

౨

రెండుమూఁడు దినములు గడచిపోయెను. భోజన మొనరించుచు చంద్రనాథుఁడు వితంతు విప్రాంగనను విలోకించి "అమ్మా! బ్రాహ్మణులందు మీ దేశాఖ?'' యని ఆమెను ప్రశ్నించెను.

వితంతువు ముఖము వివర్ణమైపోయెను. ప్రశ్న హేతువామె గ్రహింపఁ గలిగెను. అడిగిన దానిని వినని యట్లు నటించుచు నిలిచి "పోయి పాలుతెచ్చెద'' నని ఆమె యందుండి నిష్క్రమించెను.

పాలయవసర మపుడంతగ లేదు. యువకున కేమి యుత్తర

మొసంగ వలెనో యోచించుటకై ఆమె వంటగదిలోని కరుదెంచెను. దుగ్ధమునుం జల్లార్చుపోయు లలిత జనని వివర్ణముఖమును వీక్షించి అబ్బపడియెను. తనయ మొగము నొకమారు పరికించి, క్షీరపాత్రమును కరమున గైకొని, దీర్ఘనిశ్వాసము వీడి జనయిత్రి యిట్లనుకొనెను. "హే ! దీనజనబంధూ ! ఆర్తజనప్రతిపాలకా! అంతర్యామీ!—నాదుఃఖములన్నియుం బాయునట్లు కటాక్షింపుము." అనంతరమామె దుగ్ధపాత్రమును చంద్రనాధునిసమీపమందిడి ఉపవేసింపంగనే యువకుండు మరల నామెనట్లుప్రశ్నించెను.

ఒకటి వెంబడి నొకటిగ చంద్రనాధుండు ఆమె యుదంతము నంతయువిని, "మీ రింటికేల యరుగరు ?—అచట మీ కెవరునులేరా ?" అని యామెను ప్రశ్నించెను.

"నాయనా ! కూడుగుడ్డలొసంగు పుణ్యాత్ములచట నెవరును లేరు."

తలవాంచుకొని కొండొకవడి యోచించి యువకుండు "మీ కొక కూంతురుకలదు కదా ! ఆమెకు పెండ్లి ఎట్లు చేయుదురు ?" అని యడిగెను.

నిట్టూర్పు విడిచి వితంతువు "విశ్వేశ్వరుం డెఱుంగు" నని యెను.

ఆహార మించుమించుగ ముగిసెను. అప్పుడతండు మొగమెత్తి ప్రోలనున్న మగువను విలోకించి, "మీ అమ్మాయిని నేనెన్నండు అంతగా పరిశీలింపలేదు—బాలిక మిగుల ప్రశాంతస్వభావ

యనియు,బుద్ధిమతియనియు హరిదయాళుఁడనియెను. చూపుల కామె చక్కనిదేనా?"

చిరునగవు నగి బ్రాహ్మణి "కనినదానను కదా! తల్లి కన్నులను విశ్వసింపరాదు.—లలిత కురూపికాదని యనుకొనెద" నని ప్రకాశముగఁ బలికి "కాశీపురి కెంతమందియో వచ్చుచు పోవుచుందురు.—ఇట్టి రూపలావణ్యము లేబాలిక యందును జూపట్టలే" దని ఆమె యంతరంగమున ననుకొనియెను.

మూఁడునాలుఁగు దినములు గడచిపోయెను. ఒకనాఁటి ప్రభాతసమయమున చంద్రనాథుఁడు లలిత ననిమేషలోచనుఁడై విలోకించి "ఇట్టి సౌందర్య సౌష్టవ లావణ్యములు జగతియందరుదు!" అని యనుకొనెను. వంట యింట గూరుమని లలిత కూరతఱుగుచుండెను. అప్పుడచ్చోట నెవరును లేరు. జనని స్నానార్థము జాహ్నవి కరిగెను. ఎప్పటట్లు హరిదయాళుఁడు యాత్రికుల యన్వేషణార్థ మవ్వలి కరిగెను.

చంద్రనాథుఁడు బాలిక చెంత కరుదెంచి "లలితా!" అని పిలిచెను.

లలిత చకితయై లజ్జావనతవదనయై, "ఏమండీ?" అనెను.

"నీకు వంట తెలియునా?"

"తెలియును."

"ఏమేమి వండుట నేర్చికొంటివి?"

లలిత మిన్నకుండెను. ఏలనన జవాబు చెప్పవలసి వచ్చి

నచో అనేక వస్తువుల పేరుల నామె ఏకరువు పెట్టవలెను.

బాలిక భావమును గ్రహించి, ప్రసంగము మార్చి "నీతల్లియు, నీవును ఇచట పనిచేయుచుందురా?" అని యువకుఁ డామెను ప్రశ్నించెను.

"చిత్తము" అని బాలిక మెల్లగ పలికెను.

"నీకు జీతమెంత?"

"నాకు జీతములేదు.—అమ్మకు మాత్రమున్నది. నా కాహారము మాత్రము లభించును."

"పట్టె కూటికే నీవు చాకిరిచేయుచుంటివా?" లలిత నీరవయై యుండెను.

"ఉదరపోషణమునకు వెరవు చూపిన యెడల నీవు నాకు పరిచర్య సలుపుదువా?"

"అమ్మ నడిగెద" నని బాలిక మెల్లగఁ బలికెను.

"అడిగి చూడుము."

ఆనాఁడు హరిదయాలు నొకటి రెండువిషయము లడిగి, తనయధీనమందలి యుద్యోగికి చంద్రనాథుఁడి ట్లుత్తరము వ్రాసెను!

"నేను వారణాసిపురమునం దుంటిని. ఈనగరమున నీ మాస మందే పరిణయమాచరించుకొనవలెనని నిశ్చయించితిని. ఈవార్త మాతులు మహాశయునకుఁ దెలిపి, వలయు అర్థమును, అలంకారములను, వివాహసంభారములను గొని శీఘ్రముగా రండు."

ఆ మాసములోనే చంద్రనాథుఁడు లలితను పరిణయ మాడెను.

తదుపరి ఇంటికి మరలు సమయ మాసన్నమాయెను. కన్నీరు చెక్కులపై జాలువార వధువు "అమ్మపని ఏమ గును?"

"ఏమగునేమి?—మనతో వచ్చును."

ఈ మాట వితంతువు చెవులఁబడెను. తనయను మఱుగు నకుఁ బిలిచి ఆ మగువ "అమ్మా! అత్తింటికరిగి అమ్మకై వగ వకుము. బ్రతికినన్నాళ్లు విశ్వేశ్వరుని సమ్ముఖమందే యుండ నిశ్చయించితిని. ఎప్పుడైన మీరీ పురికి వచ్చునెడల, మరలఁ గలసికొందుము. అని గద్గదకంఠయై పలికెను.

జననిని గవుంగలించుకొని బాలిక వెక్కి వెక్కి ఏడ్వఁ దొడఁగెను.

తనూభవ అశ్రువులఁ దుడిచి,గారవమున నామె నూరార్చి మాత "అమ్మా! అన్నియు నెఱిఁగికూడ నిట్లనువఁ జెల్లునా?" అనెను.

జనయిత్రి వక్షస్థలమున ముఖమిడి, ఆమె కౌఁగిలింత యందుఁ దనుల్లత నణఁచి లలిత "అమ్మా!" యని యొక నిట్టూర్పు విడిచెను.

"అమ్మా! అమ్మకొఱకై అమ్మను మఱచుటే అమ్మ యెడ భక్తియని నమ్ముము."

అల్లుడెంత వేడినను, అనుగమింపక ఆ యభాగిని వారణాసి

యందే ఉండిపోయెను !

"అన్యస్థానమునకు రాజాలనియెడల వారణాసి యందే స్వతంత్రజీవనమున నుండవచ్చును" అని చంద్రనాథుఁ డామె నుద్దేశించి పల్కెను.

అందులకు కూడ ఆమె యియ్యకొనక యిట్లనెను. "హరి దయాళుఁడుగారు నన్ను కన్న బిడ్డకైవడి కాంచుచుందురు. దిక్కులేని సమయమున నాకు దిక్కై ఆయన నా యార్తి నపనయించిరి. ఈ యాశ్రయముఁ బడసిననాటనుండి నేనాయ నను జనకునివలె నెంచుచు, వారికి సేవ సలుపుచున్నాను. ఇప్పుడు వారినివీడి స్వతంత్రజీవనము సల్పుట నా కిష్టము కాదు."

ఆత్మసంభ్రమము నధికముగ పరిగణించి, అన్యులదయపై నాధారపడు నాఁడుది కాదని గ్రహించి, ఆమెను గాశీపురి యందే విడిచి అర్ధాంగిని దోడ్కొని చంద్రనాథుఁడు నిజాల యమునకు వెడలిపోయెను.

అత్తవారి యున్నతహర్మ్యము లలితకు కన్నుల పండు వొనరించెను. సౌధపరిసరమున రమ్యమైన ఆరామమొండు బాలికకు నేత్రపర్వము గావించెను. భవనమందలి వివిధ సుందర నవనాగరకోచిత సామగ్రులెంతయు నింపుగనుండెను. క్రొత్తకోడలి విస్మయమునకు మేరలేకపోయెను. "ఆహా! ఎంత యనుగ్రహము! ఎంత కటాక్షము" అని యామె యుబ్బరపడఁ దొడఁగెను.

చిన్ని వధువున కాదరపూర్వకముగ భవనమంతయుఁ జూపి, చంద్రనాథుఁడు "మేడయంతయు చూచితివి కదా! మనసునకు నచ్చెనా?" యనియెను.

కడుంగడు బిడియమున ముఖపద్మము నవగుంఠమధ్యమున మఱుఁగు పఱిచి లలిత అల్లన దలనూపెను. అర్థాంగి మానసిక భావమును గ్రహింపవలెనని చంద్రనాథుఁడు మక్కువపడలేదు. ప్రత్యుత్తరముగ నాపల్లవోష్ఠి మధుర కంఠస్వరమును వినవలెనని ఆతఁడాతురపడియెను. అందుచే ఆమెను నిజభుజమృణాలముల నదుమ బంధించి, అవగుంఠ మధ్యమునుండి ఆమె యాననము బలవంతముగ ఈవలికిఁ దీసి అనంత యనురాగము వెదఁజల్లుచు ఆమెచక్కుటద్దముల నొక్కి "ప్రేయసీ! ఈ సామగ్రులన్నియు నీమనసునకు నచ్చెనా?" యని యడిగెను.

లజ్జచే లలిత ముఖసరోజ మారక్తమైపోయెను. విడువక మగఁడడుగుటచే తప్పించుకొనజాలక, "ఇవన్నియు మీవేనా?" యని యామె లజ్జచే చివాలున తలవాల్చెను.

మందస్మిత వదన వనరుహుఁడై, ఆత్మసంవరణ మొనరించుకొనఁజాలక చంద్రనాథుఁ డాచంద్రాననను గాఢముగ కౌఁగిలించి పలుమాఱామెను ముద్దాడి, "ప్రేయసీ! ఇవన్నియు నీవే!" అనియెను.

కతిపయ దినములు గడచిపోయెను. లలిత కోడువచ్చెను. శ్రద్ధాళువయ్యె, భక్తి తత్పరయై ప్రియుని కామి శుశ్రూషలు నెఱపుచుండెను. చంద్రనాథుఁడేమియుఁ దెలుపకమున్నే, ఆతని మనోభావము గ్రహించి ఆమె వలయు సపర్యలు సలుపుచుండును. ఆమె పరిచారిక మాత్రమగుచో, విశాలవిశ్వమందెందుఁగాని చంద్రనాథుఁడట్టి దాసిని పడయఁ జాలకుండువాఁడు. కాని దాస్యము కొఱకు మాత్ర మెవండును పరిణయమాచరించుకొనఁడు—పత్నికడ నింకను అధికము పడయవలెనని అతఁడు ప్రత్యాశించును. దాసీ యా చరణముతో నర్ధాంగి యా చరణము సర్వతోభావమున, మిలనము కాకుండుటే మేలని తోఁచెడిని. లలిత నడవడిక కడుంగడు నిరీహమై, మధురమై యుండెను. కాని దాంపత్యసునిబిడ పరిపూర్ణ సుఖమునామె ఇంచుకంతైన పెంపొందింపఁ జాలకుండెను. అందుచే నట్టి మధురమిలనము కతననైనను,—అట్టిభక్తి శ్రద్ధల మూలముననైనను, వా రిరువుర నడుమ నించుక అంతరాళము సూపట్టెను. ఒకనా డాతఁడు అర్ధాంగిని చెంతకుఁ బిలిచి గారవమున "ప్రేయసీ! ఇంతభయమున మసలుచుంటివేల? నే నేమైన అనుచిత మొనరించితినా?" అని ఆమెనడిగెను.

లజ్జావనత ముఖియై మిన్నకుండి అంతరంగమున నామె యిట్లనుకొనియెను. "దీనియు త్తర మెఱుగరా? మీరు దేవ

తుల్యులు, ఉత్కృష్టులు, మహనీయులు, మహాత్ములు.—నేనో నికృష్టురాలను, ఘృణిత పరిచారికను, మీరు ప్రతిపాలకులు.—నేనాశ్రితను! మీరుదాతలు.—నేను భిఖారిణిని."

ఆ సీమంతిని హృదయకరండము కృతజ్ఞతా పరిపూర్ణమై యుండెను. అనురాగము అంతఃసలిలయగు ఫల్గుశైవలిని కైవడి అల్లనల్లన ఆమె హృదంతరతమప్రదేశమున ప్లావితమగుచుండెనుగాని ఉచ్ఛృంఖలమై, ఉత్తాల తరంగములఁ బై కుబికి వచ్చుచుండెడిదికాదు. అవిచ్ఛిన్నమై, అనారతమట్లు ప్రవహించు ప్రణయఝరిని జంద్రనాథుఁ డుపలక్షింపఁ జాలక పోవుచుండెను. దౌర్భాగ్యులు కొందఱు జీవనమధ్య సమయమున భగవాను నెంత యత్నించినను, కానఁ జాలనట్లు లలిత యంతరంగమందలి అనురాగము నామెపతి చూడఁ జాలకపోయెను. నేఁ డాకస్మికముగ ఉజ్జ్వలదీపాలోకమున పద్మముల పగిది వికసితములైన ఆమె విశాల నయనముల నుండి అశ్రుధార లల్లనల్లన జాలువారుట విలోకించి వ్యథితమనస్కుఁడై, అతఁడామెను దగ్గఱకు జేరఁబిలిచి కరనాళీకములఁ బట్టి "హృదీశ్వరీ! అట్లుండు చుంటివేల?" అని యాపె నడిగెను. లలితముఖ మవనతమై పోయెను. అర్ధాంగి వక్షసీమ నుండి అల్లన ఆతఁడు ఆననమెత్తెను. తప్తనిశ్వాస వాతూల మించుక బాలిక నిమీలిత నేత్రములపై సోఁకెను.

"లలితా! ఒకమాఱు కన్నెత్తి చూడుము" అని యువకుఁడు ప్రేమ పురస్సరముగఁ బలికెను.

బాలిక కనుఱెప్పలు రెండును ఆకులభావమున ఒకదాని నొండు కవుంగిలించుకొనియుండెను. ఎంత యత్నించినను ఆమె కన్నులు తెఱువఁ జాలకపోయెను.

ఇంచుకసేపయిన పిదప మరల నిట్టూర్పు నిగిడించి, చంద్రనాథుఁ డిట్లనెను. "లలితా! నీకింత భయమేల? ఒకమాఱు కనులు తెఱచి నా మొగము తేఱిచూడుము. పతిహృదయ పర్యంకమున పవ్వళించియు, నతంతరంగమున ప్రవహించు ప్రణయకోమలతరంగిణీ మంజుల మధురనిస్వనము వినఁజాలకుంటివా? ప్రేయసీ! నన్ను నీవింకను గుఱుతింపఁ జాలకుంటివి. అందుచే నీవంటి వధూటీమణిని పడసియు నేనెంతయు వందురవలసి వచ్చుచుండెను!"

అప్పుడు కూడ ఆమె ఏమియు పలుకఁ జాలకపోయెను! అంతరంగమున ప్రాణేశ్వరుని చరణసరోజములకు ప్రణమిల్లి ఆమె యిట్లను కొనియెను. "స్వామీ! నేను పదాశ్రితయైన దాసిని. పరిచారక నశ్రాంతము పరిచారిక పగిదినే యుండ నిండు!!"

## ౪

హారకాళి మనసున నించుకంతైన సుఖములేదు. ఆమె యొకటి తలఁచిన, దైవము వేఱొకటి యోచించెను. అందుచే ఆమె

చిత్తమంతయు విక్షిప్తముకాఁ దొడఁగెను. వృద్ధి కొందఱు మానవుల కన్నులెదుట కంటకాకీర్ణ కానన ముకరణి చూప ట్టును. నిజయత్నములచే వారాగహనాభ్యంతరమునుండి నేదేని పంథ నన్వేషింపవలెను. కొందఱకు లభ్యమై కొందఱ కది యలభ్యమగును. చాల దినములనుండి హరికాళి ప్రాపం చిక కాననమున నొక సంక్షేపపథము నన్వేషించుచుండెను. చంద్రనాథుని తండ్రి పరమపదించినపు డామె కాలవిసినతల మున నించుక తెరువు చూపట్టెను. కాని మేనల్లుని ఆకస్మిక పరిణయమును, పత్నియెడ నాతఁడు చూపు ప్రగాఢ ప్రణ యమును ఆతెరువున కడ్డముగ నిలిచెను. తనతల్లి వంక బాలిక యొార్తుకయైన క్రమక్రమముగ యీాడు పడసి ఆమె తలచిన తెర్వున ప్రసన్నముఖియై యుండెడిది. కాని లలిత అత్తావునఁ బ్రవేశించి ఆమెను దటిమివైచెను. అందుచే హరి కాళి మనసునందలి సుఖశాంతులు అంతర్హితములై పోయెను.

గృహమున నిక్కముగ నామె స్వామినియై ఆమెపతి అధి పతియై యుండెను,—ఇపుడైన వారిగృహ స్వారాజ్యమున కెట్టి యడ్డంకియు కలుఁగలేదు. వారి యాచరణమున లలిత ఎన్నఁడు అసంతోషము తెలుపలేదు.— అభిమానముగాని ఆగ్రహముగాని వెలిబుచ్చక ఇంటఁ గుడుచు కొండొక పరి చారిక పగిది ఆమె మెలఁగుచుండును. గృహమునకు నిక్కంపు స్వామిని ఆమెయే యైనను పతిమాతుల మాతులానుల యను గ్రహము మీాఁదనే ఆధారపడునట్లామె సంచరించుచుండెను.

లలిత యడకువకు కడుంగడు నలరి హరికాళిపతి "ఆహా! మా పుణ్యముల కొలది మాకీ సుగుణాలవాల—" యని ప్రశంసింప గమకించుచుండును, కాని హరికాళి కన్నులెఱ్ఱ జేసి, ఆతనిమాట కడ్డుపడి "చాలునిఁక ఊరకొనుఁడు. కవితా ధోరణి అధికమగుచున్నది. ఇంచుక యోచనయున్న ఈవఱ లోనే మేరువ నెక్కియుండెడి దానను, వివాహ మిచ్చుటకు మారుగా కాలుసేతులు కట్టివైచి నా తలితండ్రులు నన్ను నట్టేటఁ బడవైచిన బాగుండెడిదని ఆమె సహజ కర్కశస్వరమున నొక చిన్నియుపన్యాస మొసఁగుచుండెడిది!

వ్రజకిశోరుఁడు మొగము వికృత మొనరించుకొని పత్ని మోములనుండి అవ్వలి కరిగి ఏదేని గొణుఁగు కొనుచుండును.

హరికాళి వయసు సుమారు ముప్పదేండ్లుండును—కాని లలిత కింకను పదునేను వత్సరములు గడువలేదు. లలిత యరు దెంచిన దాది, వారిరువుర మనసులందు ఘోరాజి ఉత్పన్న మాయెను. ఎంత యత్నించినను, హరికాళి విజయ మందఁ జాలకపోయెను. కసుగాయ యగు నొక బాలిక కట్టి శక్తి యుండుటఁ గాంచి ఆమెసహింప లేకపోయెను.

లలిత నోరులేని మూగమనిషి కాదని హరికాళి ఎఱుఁగును. కఠినోక్తులచే నెన్నిమాఱు లామె మనసు నొప్పించినను ఆనతవదనయై ప్రశాంతవచముల నప్పుడప్పుడామె ఉచితో త్తరముల నొసఁగుచుండెడిది; కాని బాలికతో సంధి సలుపుటకుగాని ఆమెను జనదాని గావించుకొనుటకుఁ గాని ఆమె

సమర్థురాలు కాఁజాలకుండెను. లలిత కలహప్రియగాని, లేక దురూక్తి నిపుణగాని, స్వార్థపరగాని, లేక నిర్దయగాని, హింసాపరవశగాని లేక అభిమానినిగానియైయున్న యెడల హారికాళి ఏదేని తెఱవు గాంచఁజాలెడిది. కాని లలిత కడ నుండి ఆమె యనంతానుగ్రహముఁ బడయుచు వచ్చుచున్నం దున ఒరుల కరుణకై ఆమె యపేక్షింప నక్కఱ లేక పోవు చుండెను. గృహమున కంతకుఁ దానయే సర్వాధికారిణి యనియు, హారికాళి ఉదరపోషణమునకై యనుదెంచిన అనదమాత్రమనియు ఎఱిఁగియుండియు వెలుపలకుఁ దానే అనదయట్లుండి లలిత హారికాళిని సర్వస్వతంత్రురాలిఁ గావిం చెను. కాని హారికాళి మాత్రము బాలికపైఁ గల ఈర్ష్యచే క్రమక్రమముగ దగ్ధము కాఁజొచ్చెను.

కేవల మొక్క తావును మాత్రము లలిత తన కోసరమై యుంచుకొనియెను.—ఆ తావునందున హారికాళి ఒక యడు గైన నిడఁ జాలకుండెను. మహత్తరమై, అదృశ్యమైన గాఢానురాగ సూత్రము న్నొండామె పతికి నల్వాలకులఁ గట్టినకతన, దానిని భేదించి ఆతనిఁ దాకుట కెరికి సాధ్యము కాకుండెను. ఆహద్దున కవ్వల నిలిచి, హారికాళి ఏమిచేసినఁ జేయఁజాలుఁగాని అందు ప్రవేశింపఁజాలదు.—అట్లు ప్రవే శించుట కామె కధికారము లేదు. ముక్కుపచ్చ లిప్పుడ యూరుచున్న బాలిక యొక్క ఏదేని మహామంత్రము మూలమునఁ దన సఖదంతముల నంటియున్న గరళమువంతను

బీల్చివై చుచుండెనని హరికాళి గ్రహించెను.

ఇట్లాఱువత్సరములు గడచిపోయెను. లలిత పదునొకండవ యేట కాపురమున కరుదెంచెను. ఇపు డామె పదునేడేడుల ప్రాయమై లావణ్యలతికయై, యౌవనఖనియై, సర్వాంగ సుందరియై యలరారుచున్నది.

## ౫

వయసు సమ్మాననము పురుషులందున్నట్లు స్త్రీలందు లేదు. ముప్పదేండ్ల ప్రాయపువాఁడు ఇరువదేండ్ల వయసు వాని మ్రోల నధికగౌరవమున సంచరింపఁ జాలును. కానివనితలందిది చెల్లఁజాలదు. కన్యచర వీడు నందాక బాలికలు గృహమందలి యాడువారికడ కొంతజ్ఞానము సంపాదించి, పదంపడి ఒక్కదాటున ప్రథమ శ్రేణిఁ జొచ్చుదురు. అపుడు పదునాలేండ్లు మొదలేబది యైదేండ్లవఱకు స్త్రీలందఱు సమవయస్కుల భాతి సంచరించుచుందురు. స్థానభేదము కలుగునపు డించుక ప్రభేదము చూపట్టినఁ జూపట్టవచ్చును; కాని సాధారణముగ నీ నియమమునకు వ్యతిక్రమము ఘటింపదు.

ఆనాఁడు అపరాహ్ణసమయమున లలిత నిజగృహావాతాయనముఁ దెఱచి ఆకసమువంక దృక్కులు పఱపుచు నిలిచి యుండెను. ఆయూరి ముసలిది యొూర్తు ఇంచుక మిష్టాన్నము

నొక పళ్లెరమం దిడికొని, చక్కని పుష్పమాలను గైకొని తిన్నగ లలిత నిలిచిన తావున కరుదెంచి, మాల్యమును బాలిక కంఠమం దలంకరించి, "నేడు మొదలు నీవు నా సఖివై తివి—నన్ను సఖీ యని పిల్వుము" అనియెను.

లలిత అబ్బురపడిపోయెను. చిరునగవు నగి "మంచిదిలెమ్మ్లే!" అనెను.

"మంచిది. అనిన చాలదు—'సఖీ!' అని పిలిచి తీరవలెను!"

ఇది కోరికయైనను, ఆనయైనను లలిత ఈవఱలో నెన్నఁడు నిట్టిదాని నెఱిఁగి యుండదు. అందుచే ఆకస్మికముగ లభించిన ఈ ఆత్మీయయెడ ఆమె వలయు చనువు చూపఁజాలకపోయెను. తనకు 'అమ్మమ్మ'నఁదగి యున్న ఒక వృద్ధనారిని నిముసమాత్ర పరిచయమున 'సఖీ' యని పిలుచుట కామె బిడియపడెను. కాని వారిబాల ఆమెను విడిచి పోలేదు. తన వాంఛయందు నూతనత్వముఁ గాని అస్వాభావికత గాని యున్నట్టు వృద్ధాంగన తలఁపనైనఁ దలఁపలేదు—అది యామె తలఁపునకు పూర్తిగ నతీతమై యుండెను. తాఁ గోరినట్లు ప్రేమపురస్సరముగ బాలిక పిల్వకుండుట ఉపలక్షించి మ్లానముఖియై, ఇంచుక గంభీరభావమున ముసలిది "అట్లైన నామాల నా కిచ్చివేయుము—మఱొక తావున కరుగుదును" అనెను.

వృద్ధాంగన లక్షణములు లలిత కాశ్చర్యము కలిగించెను. కాని ఆమె అప్రతిభ కాక ఇంచుక నవ్వి "సఖి నొకతెను వెతకుకొనుటకా?" అనెను.

"అబ్బా! మాటలు నేర్చిన వన్నెలాడివే!—వట్టిమూగది. మాటలేదు మంచిలేదని అనుకొను లోకులు అట్టివ వట్టి మూర్ఖులని ఇప్పుడు బోధపడినది."

'సఖి' మాటలు విని లలిత నవ్వసాగెను.

"ఇదిగో! చెప్తాను విను! ఈఊళ్లో నీకొక్క జతకత్తె అయినా లేదు. గొప్పవారిల్లనిగాని, మీఆయన మేనత్త తీయని నోటిబలముచేగాని ఎవ్వరు నీయింటి కెక్కరని ఎఱుంగుదును. కాని, నే నేమీ లక్ష్యపెట్టక నీవద్దకు వస్తూఉందును. ఎవరైన జతకత్తె ఉన్నగాని నాకు దినము గడవదు. అందుచే ఒక సఖికొఱకై నేడు బయల్వెడలితిని. పెద్దముండాకూతురనైతినిగదా, అయినా, 'రామ! రామ!' అని దినమంతా మాల తిప్పుకొంటూ నే నుండలేను తల్లీ!—అందుచే నేనురోజూ నీదగ్గఱకు వస్తూఉంటాను సఖీ!"

"మంచిది. అనుదినము రండు."

మాటలు విని కెవ్వన కేకవైచి కను లెఱ్ఱజేసి "'రండేమిటి రండు!' చెలీ! రోజూ వస్తూ ఉండవే!" అనుము. 'ఏమే,ఓసే' అనలేవేం? అంటే నీవు ట్టమైనా మునిగిపోయిందేం?"

పకపక నవ్వి లలిత "అమ్మమ్మా! క్షమింపుము. నే నట్లన జాలను" అనెను.

వృద్ధాంగన కూడ నవ్వి "మంచిది అలా పిల్వకపోతే, పోయింది కాని 'నువ్వా' అనియైన పిలవవలెను. 'చెలీ! నువ్వు రోజూ రా!' అనుము" అనెను.

అవనత వదనయై లలిత చిరునగవుతో కనుంగడు బిడియమున 'చెలీ! నువ్వు రోజూ రా!' అనెను.

ముసలిది పరమానందభరితయై పోయెను. ముడుతలు పడిన ఆమె ముఖారవింద మొకమాఱు వికసించి పోయెను. "చెలీ! వస్తానే!" అని ఆమె మాఱు పలికెను.

మఱునాంటినుండి హరిబాల తఱచుగ రాం దొడంగెను. ఎన్ని పను లున్నను, ఒకమాఱు 'సఖి'నిం జూచుటకై ఆమె వచ్చుచుండెడిది. క్రమక్రమముగ వారి హాస్యపరిచయము గాఢము కాందొడంగెను. హరిబాల సమవయస్క కాదనియు, ఇరువురు చేతులు కలుపుకొని నడచుతఱి తనవలె మొగ్గవలె వర్ధాంగన చూపట్టదనియు, సర్వాంగసౌందర్యమునం దనతో నామె ఎట్లును సుజ్జీ కాదనియు లలిత పూర్తిగ మఱచి పోయెను.

ఇట్టి యంతరంగభావము హరకాళి మనసున కెట్లు తోంచెడిదో తెలుపంజాలము కాని చంద్రనాథుని కమితానందము కలుగంజేసెడిది. పలుమా ఱాతడు పత్నిని ప్రణయపురస్సరముగం జేరబిలిచి ఆమె సఖిని గుఱించి ముచ్చటించుచుండును. వృద్ధనారి చూపు ఆకస్మిక అస్వాభావిక హృద్యత ఆతని కెంతయు వేడుక కలుగంజేసెడిది.

చంద్రనాథుం డర్ధాంగిని ప్రాణములకన్న మిన్నగం బ్రేమించుచుండును. పృథ్వియందు పతులందఱి కొక్కమాదిరి పత్ని లభింపదని ఆతం డెఱుంగును. ఒక్కొక్కని భార్య

దాసివలెను, ఇంకొక్కరునిపత్ని చెలిమికత్తె చాడ్పునను, మఱొక్కపని సతి అధికారాభిలాషిణియై ప్రభ్వీణిచందము నను సంచరించును. భాగ్యవశమున పుణ్యవతియు, పవిత్రచిత్తయు, సాధ్వీమణియు ప్రణయమయియు నైన అర్ధాంగి లభించినపుడు చంద్రనాధుని సుఖమునకు మేరలేకుండెను— అంతియేగాక సహభాగిని శైశవదుఃఖకథ మాటిమాటి కాతనికి జ్ఞప్తికి వచ్చుచు ఆమెయెడ నెంతేని జాలిఁబుట్టించుచుండును. పిన్ననాఁడామె కడలేని కడగండ్లు కుడిచెను.

ఒక యభాగిని గుపుపునఁ బుట్టిన కతన ఆ మరణమామె అనంతములైన అగచాట్లుబడి క్రుక్కవలసినదే! అట్లుకాకున్న దరిద్రుఁడును, దుశ్చరిత్రుండునైన పూరుషుని చేతులఁబడి క్రుక్కవలసినదే. లేక దాసీవృత్తి నవలంబించి దుస్సహాత్యాచారోత్పాదనములకు గుఱియై పడరాని పాట్లు పడుచుండెడిది! అట్లుకానిచో, అత్యధిక రూపయౌవన సంశోభితయగుటచే దుశ్చరితుల కరములఁబడి నిరయ పథగామినియైన నయ్యెడి దని యూహించినను నూహింపవచ్చును. ఆహా! అదెట్టి శోచనీయావస్థ!

ఈ తలఁపులు మనోవీధిఁ బర్విడినపుడు గభీరకరుణాపూరనస్రముగ చంద్రనాధుఁ డర్ధాంగి లజ్జితముఖ పుండరీకమునెత్తి అనురాగంపు టూక్తుల నామెనుద్దేశించి "లలితా! నేను నిన్ను చూచి యుండకపోయినయెడల నిన్ను పరిణయమాడ కనే పోయెడి వాఁడనుగదా! ఇపుడు నీ వెచటనుండి యుం

దువు" అని ప్రశ్నించుచుండువాఁడు.

లలిత ఉత్తరమొసఁగెడిది కాదు ; అవనతవదనయై హృదీశ్వరుని హృదయప్రాంతమున కరుదెంచి నిలువంబడెడిది.

అనంతానురాగమున అర్ధాంగి చుబుకమును నొక్కి ముద్దాడి మధురమంజుల స్వరమున "లలితా! నా కడ నీకింత లజ్జ ఏలనే?" అని యాతఁడు వాక్రుచ్చుచుండును.

నిరుత్తరయై లలిత దుఃఖపూరితశైశవము దలఁచుచు భయపడు లాగున మఱింత కుఱుఁగలిఁ జేరుచు మగని ఱొమ్ము మఱుఁగున నిలువంబడును. పతియది గ్రహించి పత్నిని హృదయపల్యంకమునఁ జేర్చి "లలితా! నీవొక దుఃఖిని యింట ఏల జన్మించితివో ఎఱుఁగను. జన్మ జన్మాంతరములందును నా కర్ధాంగివైన పతివ్రతవు. విశాల విశ్వమం దేతావున నున్నను నీ దాపునకు నన్నాకర్షింపఁజాలుదువు. అట్టి యాకర్షణము కతననే వారణాసిపురమునకుఁ రాఁగలిఁగితిని.

లలిత చూపు ప్రణయశ్రద్ధా భక్తులన్నియుఁ గలపినను, అత్తఱి చంద్రనాథుని హృదయకరండమున ప్రవహించి పవిత్ర భావస్తోత్రముతో సరిపోలవనుట అత్యుక్తి కాదు. ఆయభాగిని యెడ ననిర్వచనీయమైన అనురాగము ననుగ్రహముచూపి ఆతఁ డందిన అనంతానందము లలితను పరిణయమాడిన తఱి ఆత్మ ప్రసాదము పగిది ప్రచ్ఛన్నవేషము దాల్చి వాని నిభృతాంతరంగమున నల్లన బ్రవేశించి, ఉచ్ఛేదము కాక హృదయమం దొక కోణమున నడగియుండి అపు డపు డొదలనె త్తి

ఆధిరానురాగముల కిక్కువైన అతని ఱొమ్మునకు బ్రియు రాలిఁ జేర్చుచుండును. పతి యపుడు పరమ పరితోష సంభరిత స్వాంతుఁడై “లలితా! అనవరతము కన్నులకుఁ గట్టినట్లు తోఁచుచు నున్న వానిని గుఱుతింపుటకు నీకింత విలంబమగుచున్నందులకు మిగుల నబ్బురపడుచుంటిని! నిన్ను వారణాసిపురమున జూచినంతనే నీవు నా దానవని గుర్తింపఁ గలిఁగితిని—పెక్కుయుగములనుండి,—అనేక కల్పాంతరములనుండి, జన్మజన్మాంతరముల నాదాననై యుంటివని గ్రహింపఁజాలితిని! ఏలనో కొండొకకాలము విడివడినను మరల గలిసికొనఁ గలిఁగితిమని సంతసం పడితిని.” అనుచుండును.

హృదయేశుని హృదయమున నిజాననము నణచుకొని, లలిత “నేను మిమ్ము గుఱుతింపలేదని మీ కెవరు తెలిపిరి” అనెను.

ఉత్సాహాతిరేకమున చంద్రనాథుఁ డర్ధాంగి లజ్జిత ముఖమును నిజాననము దాపునకుఁ దీసికొని అనురాగపూర్వకముగ నామె చుబుకము స్పృశించి ముద్దాడి, “గుర్తింపఁ గలిగిన యెడల, ఇంత యడలు సూపుచునుందువేల? నే నేదేని యపచారము సలిపియుంటినా? నిన్ను నా ప్రాణములు కన్న మిన్నగఁ బ్రేమించుచుంటినని ఎఱుఁగవా?”

లలిత మరల మగని ఱొమ్మున మొగము మఱుఁగు పఱచుకొనెను.

ప్రియురాలి వినీలకుంతలములు సవరించుచు, చంద్రనాథుఁడు "అడలెందులకో తెలుపు" మనెను. లలిత యుఁక నుత్తర మొసఁగఁజాలకపోయెను. జీవితేశుని స్పృశించి, ఆమె యన్మృత మెట్లాడఁ గలుఁగును? అడలుట లేదని యెట్లు చెప్పఁ జాలును? పతి యెడల అనురాగమునకు తోడు నిక్కముగ నామె కడలు కూడ నుండెను. అట్లామె తక్క నొరు లెవ్వరు నెఱుఁగరు.

తా నన్యకార్య నిరతుఁడైన తఱి ప్రియురాలు సుఖముగ గాలముఁ బుచ్చుటకు హారిబాల అనుదిన మరుదెంచుట గాంచి, చంద్రనాథుఁ డానందించువాఁడు.

ఒకనాఁడు అపరాహ్ణమువఱకు లలిత సఖకోసరమై ఆతురమున వేచి యుండెను. ఆకసమంతయు మేఘాచ్ఛన్నమై యుండెను. వాన తుంపరలు అల్లనల్లన రాలుచుండెను. హారిబాల రాలేదు. వర్ష కారణమున నామె రాలేదని లలిత యూహించెను. ప్రొద్దుక్రుంకుట కింక విశేష విలంబము లేదు. దినమంతయు నామె యొంటరిగ గడపివైచెను;—హారకాళి కూడ నేఁడింటలేదు. ఏమియుఁదోఁచక లలిత మెల్లగ పతి పఠనాగారమున ప్రవేశించెను. విశేషావసరమున్నగాని ఎవరును నా గదిలో ప్రవేశింపరు. లలితకూడ ప్రవేశించునది కాదు. అలికిడి విని పాత్రమునుండి మోము మరల్చి చంద్రనాథుఁ డర్ధాంగి నుపలక్షించి, చిరునవ్వాననమున దేలియాడ "నేఁడు నీజతకత్తె రాలేదు కాఁబోలునే!" అనెను.

"రాలేదు."

"అందుచే నేను జ్ఞప్తికి వచ్చితిని కాఁబోలు."

లలిత స్మితముఖి యాయెను. అనవరతము జ్ఞప్తియందే యుందునుగాని రేఁబవలులు చెంగట నిలుచుటకు సాహసము చాలదను భావము నా చిరునగవు సూచించెను. "వాన భయమువలన నామె రాలేదు కాఁబోలు" నని ఆమె యుత్తర మొసఁగెను.

"కారణమదియై యుండదు. ఈ వేళ మా పినతండ్రిగారి కొమరిత నిర్మలను పెండ్లికూతురు చేయుచున్నారు. కన్య నాశీర్వదించుట కామె వచ్చెనని వింటిని. కొలఁది దినములలో పెండ్లియగును. పెండ్లి తొందరలో నీ జతకత్తె నిన్ను మఱచి యుండును."

"అట్లే కావచ్చును."

చంద్రనాథుఁ డించుకసేపు మిన్నకొని "మనవారలందఱు మనలను పరాయివారిగఁ జేసివైచిరి—మా మేనత్త ఏదీ" అనెను.

"ఆమెకూడ క్రొత్తపెండ్లి కూఁతురును చూచుటకై పోయి యుండును."

చంద్రనాథుఁ డేమో యోచింపఁదొడఁగెను.

లలిత మెల్లగ పతి దాపుచేరి ఉపవసించి "ఏమి యోచించుచుంటిరో చెప్పెదరా?" అని వినీతస్వరమున ప్రశ్నించెను.

నవ్వ యత్నించి, చంద్రనాథుఁడు ప్రియురాలి చేతుల నిజ

కరముల గైకొని, అల్లన నిట్లనెను. "లలితా! యోచించు టకు విశేషమున్నది? నిర్మలపెండ్లియని మాపినతండ్రి ఒక మాటైన నాకు కబురు పంపలేదు. నా యింటనుండు నా మేన మామ మేనత్తలు నా కంటె ముఖ్యులని యోచించి, వారిని మాత్ర మాతఁడు తీసికొనిపోయెను. మనమిరువుర మాతనికి పరాయివారమైతిమి."

పతి స్వర మించుక దుఃఖసూచకమై యుంట లక్ష్యించి "మీపాదములచెంత నాకు చోటొసఁగినందువలన మిమ్ము వారు మఱింత వేఱు చేసిరి.—నేఁ గాక మఱొకతె మీకర్ధాంగియైనచో మునపటివలె మీరందఱు మరల కలిసియే యుండెడివారు!" అని లలిత వచించెను.

చంద్రనాథుఁడు నవ్వి యిట్లనెను. "కలిసియున్నందువ నాకు కలిగెడు ఉపకారమేమియు లేదు. నిన్నుఁ బడయుటకు మాఱు పినతండ్రి సఖ్యము వడసియున్నయెడల పరమసుఖము ననుభవింపఁజాలి యుందునని నేఁ దలఁచను. పెండ్లిచేసికొను టకు మున్నాతనితో యోచించియున్నయెడల మన కల యిక కాతఁడు నిక్కముగ నడ్డుపెట్టియుండెడివాఁడు కులము గుఱించి గాని, వంశము గుఱించిగాని ఏదేని శంకఁ జూపి ఆతఁడు పెండ్లి ఆపియుండును!"

పాపము లలిత హృదయము కలచివైచినట్లైపోయెను. సంధ్యాఛాయ ఆగారమునఁ బ్రవేశించి క్రమక్రమముగా దానిని తమోమయము గావించివైచెను. అందుచే చంద్రనాథుఁ

డర్ధాంగి ముఖము నవలోకింపఁ జాలకపోయెను. కాని అతని కరమున నణఁగియున్న కోమల కర మృణాలము కంపించి లలిత అంతరంగమందలి విషాదభావకలాపమును వాని కెఱుక పఱచెను. స్మితముఖుఁడై "ఆతని యాలోచనముఁ గైకొనక మంచి గావించితినో చెడుగు చేసితినో ఇపుడు గ్రహింపఁ గలుఁగుచుంటివా?" అని యాతఁ డనెను.

క్షణకాలము మిన్నకొని "ఏమి చెప్పుదును—అసంఖ్యా కులైన నావగిది చరణాశ్రిత పరిచారికలు మీకవలీలగ లభించియుందురు!" అని యామె అనెను.

చంద్రనాథుఁడు ప్రేయసి కరపల్లము ననురాగపూర్వక ముగ నొక్కి "నేనది ఎఱుఁగను. నాకు పరిచారికయొక్క తెయే! ఆమె లభించుటెట్లని భావించియుందును. అసంఖ్యా కులైన పరిచారికలను గుఱించి ఇష్టమున్న నీవు భావింపుము" అని నగుచు పలికెను.

మఱునాఁడు హరిబాల యరుదెంచెను. ఆమె ముఖ చిహ్నము లేమో నేఁ డించుక వేఱుగ చూపట్టెను. ఎప్పటి వలె అనురాగావేశమున ముందఱి కరుదెంచి "చెలీ!" యని సంబోధించి లలిత నామె కవుంగిలించుకొనలేదు.—గవ్వా లాడు కొందము రా రమ్మని ఆమె నొకమాఱు వీడించి మఱొకమాఱు బ్రతిమాలలేదు—మలినముఖయై, మౌన ముద్రను దాల్చెను!

"సఖి! నిన్న రాలేదేల?"

"అక్కా! నిన్న వచ్చుటకు ఇంచుకైన తెలుపి లేక పోయెను. నిన్న ప్రొద్దున పెళ్లికూఁతురును చేసిరి. నిన్న సాయంత్రము పెండ్లి పీటలమీఁద కూర్చున్నారు.—అయితే చెలీ! నిర్మల పరిణయమని ఎఱుఁగవా?"

"పరిణయమని వింటిని.—పెండ్లి వార్తలేమి?"

వృద్ధాంగన ఆప్రశ్న కుత్తరమొసఁగక లలిత ముఖమును తేఱిచూచి "అక్కా! నిన్నొక సంగతి అడుగుదును.— నిజము చెప్పెదవా?"

"అదేమి?"

"నిజము చెప్పెదనంటేనే, అడిగెదను.—లేక పోయిన అడిగినందువలన ప్రయోజన ముండదు."

ఇంచుక యోచించి "నిజమేల చెప్పను?" అని లలిత యనెను.

"సరే—మంచిది. అయితే అక్కా! నా యెడల నీకు సంపూర్ణవిశ్వాసమున్నది కదా!"

"ఉండకేమి—నిక్కముగ నున్నది."

"అట్లైన నేమియుఁ దాపక నాతో సత్యము వచింపుము.—నీపతి నీయెడల నధికానురాగము చూపుచుండునా?"

లలిత యించుక బిడియపడి "నాయెడ వారికి దయ మిక్కుటము" అనెను.

"దయమాట నే నడుగుట లేదు—అనురాగవిషయ మడుగుచుంటివి. నీయెడల నాతని కత్యధికమైన ప్రేమ

యున్నదా ?"

"అదెట్లు తెలుపఁజాలుదును" అని లలిత నవ్వుచు పలికెను.

"తెలుపఁజాలవా ? నీపైఁగల ప్రేమను గుఱించి నీవు కాక ఒరులు తెలుపఁగలరా ? సఖీ ! నిజము చెప్పుము. నిన్నాతఁ డెట్లు ప్రేమించును ?"

లలిత—(నతవదనయై) అది నే నెఱుఁగను.

వృద్ధసఖి మిగుల చింతితయైనట్లు చూపట్టెను. పెదవి విఱచుకొని తలపంకించి ఆమె "తన మగడు తన్నెంతవఱకు ప్రేమించుచుండెనో పెండ్లా మెఱుఁగదు ! బాగు ! బాగు !" అనెను.

హరిబాల ముఖభావమున కొండొక నిగూఢసంశయము ప్రచ్ఛన్నమైయుండెను.—లలిత అది గ్రహించి, శంకా సంకలిత స్వాంతయై, "ఎందు కిట్లడుగుచుంటివి ?" అనెను.

"మఱొకనాఁడు తెలిపెదను" అని వృద్ధసఖి లలిత చుబుకమును స్పృశించి సుస్మితముఖయై, మృదుస్వరమున, "చెలీ ! ఇంత సోయగమును, ఇంతలావణ్యమును, ఇంత బుద్ధియుఁ గలిగి యుండి కూడ ఈ మాత్ర మూహింపలేక పోతివేల ?— ఇన్నినాళ్ళనుండి నీవు చేయుచున్న దేమి ?" అనెను.

లలిత నవ్వెను.

అపు డింకను నిజము ప్రకాశము కాలేదు. హరి దయాలుని సందేహమధ్యమందే అది ప్రచ్ఛన్నమై యుండెను. జీర్ణమలినాంబరధారియైన పురుషుఁడొకఁడు రెండుమూఁడు దినములనుండి వరుసగ దయాలుని గృహమునఁ బ్రవేశించుచు, విప్రవితంతువు సులోచనతో రహస్య ప్రసంగను సలుపుచుండెను. హరి దయాలుఁడది యెఱుఁగడని వితంతువు తలఁచెను; కాని అతఁడు తొలినాఁడే దానిని గనిపెట్టెను.

నేఁడపరాహ్ణసమయమున నీశ్వరదాసను మిత్రునిగూడి హరిదయాలుఁడు చదరంగమాడుచుండెను. అప్పుడు లోపలి ప్రాంగణమందేదో అల్లరిపుట్టెను. ఎవతెయో మృదుగద్గదస్వరమున కరుణాభిక్ష వేడుచుండెను. పురుషుడొకఁడు కర్కశస్వరమున తీవ్రభాషాప్రయోగమున నాక్రోశించుచు భయము చూపుచుండెను. "దాసూ! ఇంటిలోని అల్లరి యేమై యుండును?" అని దయాలుఁడు స్నేహితునడిగెను.

"చూడు మిదిగో! నా రాజు గుఱ్ఱము దాటున నీ యేనుఁగుపై నుఱుకుచుండెను!"

దయాలుఁ డవ్వాలి కరుఁగక ఆడవలసివచ్చెను. లోని యల్లరి క్రమక్రమముగ నధికమగుచుంటగాంచి అతఁడు లేచి నిలువంబడి "బాబూజీ! కూర్చుండుము. లోనికరిగి అదేమో చూచివత్తు" ననియెను.

మిత్రుని వలువ యంచులను బట్టుకొని ఈశ్వరదాసు "ఇఁక కాచుకొనుము. నిముసములో ఆటకట్టి వేయుదును.—శక్తి యున్న నీ రాజును నా మంత్రిబారి నుండి కాఁపాడుకొనుము" అనెను.

హరిదయాళుఁడు మరల నుపవిష్టుఁడాయెను—కాని లోని యల్లరి ఇంచుకంతైన తగ్గలేదు. ఇఁకఁ గూర్చుండలేక అతఁడట్టలేచి ప్రాంగణములోని కరిగెను. జీర్ణవసనధారియగు నూతనవ్యక్తి ప్రామాల సాగిలపడి విప్రవితంతువు ఖిన్నవదనయై కన్నీటితో నాతని కాళ్లు దడిపివేయుచుండెను. ఆమలినాంగుఁడుత్తేజితుఁడై "నేఁ జెప్పినట్లుచేయుము—లేకున్న నీతో నే నన్నట్లుచేసి తీరుదును." అని తీవ్రస్వరమున పల్కుచుండెను.

సులోచన యేడ్చుచు "నన్ను మన్నింపుము. నీవంతయు నాశనము చేసితివి.—మిగిలిన కొంచెపాటి దానిని గూడ పాడుచేయకుము" అనుచుండెను.

"నీ కూఁతురు గొప్పవారింటి కోడలైనది..—రెండువేల రూపాయలియ్యలేదా? సొమ్ము చేతులో బడినతోడనే వెడలి పోదును."

"సురాపానమున కలవాటుపడి, దుష్క్రియలం దాటితేటి తివి—రెండువేలరూపాయలు నీకెన్ని దినములు వచ్చును! మరలవచ్చి పైకమునకై పీడింతువు.—నీకొక చిల్లిగవ్వయైన నీయఁ జాలను."

"తాగుడు మానివైచెదను, వ్యాపారము చేయుదును,—

పైకమునకై ఇఁక నెన్నఁడు నిన్ను వీడింపను."

సులోచన (తల మోదుకొనుచు)—"క్షమింపుము—నా యసువు లున్నంతవఱకు లలితను పైకమునకై వీడింపఁజాలను"

హరిదయాళుఁడు సమీపమున నిలిచి యుండెనని ఇరు వురలో నెరికిని దెలియదు. అందుచేతనే వారట్లు ప్రసంగించు కొనుచుండిరి. తోడనే దయాళుఁడు ముందున కరుదెంచెను. ఇరువురును చకితులై పోయిరి. "ఎవరినడిగి నీవీ యింటిలో ప్రవేశించితివి?" అని హరిదయాళుఁడు క్రొత్త మనిషిని బ్రశ్నించెను.

ఆగంతువు తొట్రుపడి, మెల్లగ నవ్వలకు జారఁ జూచెను. హరిదయాళుఁ డదిగాంచి దృఢముష్టిచే నాతని గట్టిగఁ బట్టు కొని/మరల "ఎవరినడిగి వచ్చితివో చెప్పుము" అని క్రోధ స్వరమునఁ బలికెను.

పలాయన మొనరించుట, కేవెరవు లభింపనందున, నిలువం బడి ఇంచుక ధైర్యముఁ దెచ్చుకొని ఆగంతువు "సులోచన అనుమతి బడసి వచ్చితిని" అనెను.

క్రొత్తమనిషి ముఖమునుండి సురాపానదుర్గంధము వెల్వడు చుండెను. హీనదుర్మార్గప్రవర్తనాచిహ్నము లాతని తనువున ద్యోతకమగుచుండెను. హరిదయాళుడు మఱింత మండిపడుచు "ఎవరి హుకుము పడసితివి?" అనెను.

"చెప్పితిని గదా!"

ఆగంతువు వైఖరి మాఱెను; నిముసములో నాతని భయ

మంతర్హితమయ్యెను. దుడుకుదనముఁ జూపుచు, గోఱచూపులు నిగిడించుచు నిర్లక్ష్యభావమున ప్రసంగించుచున్న ఆవిక లాంగుని విలోకించి క్రోధఘూర్ణమానమానసుఁడై, ఉచ్చస్స్వరమున హరిదయాలుఁడు "ఏమిరా! గాడిదా! త్రాగుబోతా నిన్నిపుడే ఖైదునకంపఁ గలుఁగుదుసని ఎఱుఁగవా?" అనెను.

"ఓహో! అల్లా!—చిత్తము" అని పరిహాసస్వరమున రెండవయాతఁ డుత్తర మొసఁగెను.

చేతికొలది ఆదుర్మతిని వాయింప గమకించి దయాలుఁడు "పాజీ! ఏమి ప్రేలుచుంటివి?—నాతో నీకు పరిహాసమా? నిన్నిపుడే పోలీసుల కప్పగింతు!" ననియెను.

పోలీసులవలని భయము తనకించుకంతైన లేదను భావము సూచించుచు, చిరునగవుతో "ఇప్పుడే అప్పగింతువా? కొంచ మాలస్యమున్నదా?" అని ఆగంతువు విద్రూపస్వరమునఁ బలికెను.

ఒక్కత్రోపు త్రోసి "ఇప్పుడే!" అని దయాలుఁడు వాక్రుచ్చెను.

త్రోపు నాపుకొని గంభీరభావమున నామసిషి "బాపడా! ఒక్కసాతే అంత విక్రమమును ప్రకాశింపకుము! పోలీసు వారికిఁ గాని లేక మఱి మీవారికెవరికిఁ గాని ఇంచుక యోచించి ఒప్పగింపుము.—నిన్ను నిముసములో కాశీనుండి వెడలఁ గొట్టఁగలను ఎఱుఁగుదువా?" అనెను.

ఉన్మత్తుని చాడ్పున నుచ్చైస్స్వనమున దయాలుఁడు "పలు

గాక! నలువదేండ్లనుండి కాశీలో వసించుచున్న నన్ను నేఁడు నీవు వెడలఁ గొట్టుదువా? ఏమిరా నీక్రౌర్యము!" అని యఱచుచు పలికెను.

ఆవ్యక్తి వట్టి పోకిరియని హరిదయాలుఁడు గుర్తించెను. "స్థిరోభవ! వరదోభవ!" యని వారణాసి యందున్న హరిదయాలుఁడు తన్నాశీర్వదించుచుండెను. మానవమాత్రుఁ డెవఁడు వెడలఁ గొట్టలేడని ఎఱుఁగును.

హరిదయాలుఁడు—"పాజీ! నాముంగలనా నీపోకిరీతనము!"

"బాపనయ్యా! ఇందు పోకిరీతన మేమీలేదు—ముందుగ నన్ను పోలీసుల పాలికిఁ గొనిపొమ్ము—నిజమంతయు అక్కడే తేల్చెదను."

"తేలున దేమి?"

"తేలునదే!—జాతిచ్యుతుఁడ వనియు, పూర్తిగ జెఱుపఁ బడితివనియుఁ దెలియును—ఇఁక కాశీనుండి వేఱుమార్గము నీవు చూచుకొనక తప్పదు."

"ఏమీ!—ఏ మనుచుంటివి?—నేను జాతిచ్యుతుఁడ నైతినా?"

"బాపడా! అంత ఆగ్రహ మెందులకు?—నిక్కముగ నీకులము చెడినది. నీ వొక్కడవుగాక, ఈ మూఁడేండ్లనుండి నిన్ను నమ్మి నీయింట గుడువ వచ్చిన పెద్దమనుష్యులందఱి కులము కూడ చెడినది—ఈసంగతి నే వంగతిక్రమాల వెల్లడి పఱతును."

పాపము దయాలునకు భయము పుట్టెను. భయముయొక్క యదార్థకారణము హృదయంగమగుటకు మున్నన్న యతని భీషణస్వరము కోమలమాయెను. "తండ్రీ! ఏమనుచుంటివి? నే నెందఱికులమో చెఱచితినా?" అని యాతఁ డనెను.

"అవును—వలయుచో ఋజువు చూపుదును."

"నాయనా! సంగతేమో విప్పి చెప్పుము" పుణ్యా ముం డనను.

వింతవ్యక్తి మందహాస మొనరించి "నీ వొక్కఁడవే వినిన యెడల యుక్తము కాదు—కూడ చుట్టుప్రక్కలవారు పదుగురు ఉండుట యుక్తము" అనెను.

హరిదయాలుఁ డాతని చేతులు రెండు పట్టుకొని "తండ్రీ! ఇంత కోపమేల? నిక్కముగ నీయెడ నపచార మొనరించి నీకు ఘోరాపరాధము సల్పితిని—ఈతప్పు సైరింపుము రమ్ము—లోని కరుగుదము" అని వినతిస్వరమునఁ బలికెను.

ఇరువురు అపుడు లోనిగదిలోని కరిగిరి, సంగతి ఏమో విప్పి చెప్పుము తమ్ముఁడూ!" అని హరిదయాలుఁ డనెను.

"మీయింట వంటచేయు విప్రవితంతువు మీ కెక్కడ లభించెను?"

"ఈ యూరిలోనే! అభాగిని—అనద యని ఆశ్రయ మిచ్చితిని."

"ధనాఢ్యులై, మీ రొకరి కాశ్రయ మొసఁగి సముచిత కార్యమే సలిపిరి—కాని సులోచన కులగోత్రముల నించుక

పరిశీలించితిరా?"

దయాలుని ముఖ మంతయు నొక్కమాఱుగా వివర్ణమై పోయెను." బ్రాహ్మణస్త్రీ!—వితంతువు! శుద్ధాచారిణి! ఆమె చేసిన దానిని తినినందువలన దోషమేమి!" అనెను.

"బ్రాహ్మణి యైనది నిక్కమే. వితంతు వనుటం గూడ సత్యమే—కాని ఏవ తెయేని కులము విడివచ్చినయెడల, శుద్ధాచారిణి యని యామె నను జెల్లునా? ఆమె వండిన అన్నము ముట్టవచ్చునా?"

నాలుక కఱచుకొని "శివ! శివ! అట్టి యన్నము ముట్ట వచ్చునా!" అని హారిదయాలుం డనెను.

"అట్టైన కథ ఏమో చెప్పెద వినుండు. పదునేను పదునాం టేండ్లకు మున్ను సులోచన మూండేండ్ల బాలికను జంక నిడికొని ఇల్లువిడి వచ్చినది—ఆమె కాశ్రయ మొసంగి నీజాతి చెఱుపుకొంటివి—పదుగుఱ కులము చెఱచితివి!"

"ఋజువుం జూపంగలవా?"

చూపుటకు కష్ట మేమీ లేదు—ఎవని వెంటం బడి కులము చెఱుపుకొనినదో,—అతండు ఆమె యపారరాగమున బడసిన రమాకాంతుం డింకను సజీవుండై యున్నాడు"

నూతనవ్యక్తి ముఖమును దేఱి చూచి దయాలుం డతడే రమాకాంతుండై యుండునని యోచించి "నీవు బ్రాహ్మణుండ వేనా!" అని ఆతని నడిగెను.

ఆగంతువు, మలినమైన యంగీలోపలినుండి, అధికతర మలిన

చిన్న విచ్ఛిన్నయజ్ఞోపవీతము సీవలికిఁ దీసి స్మితముఖుఁడై "కాను!—గొల్లవాడను!!" అనెను.

ఇంచుక దూరముగ నొత్తిగిలి "నిన్ను చూడఁగనే వెట్టివాఁడ వని యనుకొంటిని. ఏమైతేనేమి!—నమస్కారము" అనెను.

విశారాంగుఁడు కోపింపలేదు. నమస్కారము నందుకొని "నీ వనుకొనినది మిథ్యకాదు. నన్ను మాదిగ యనినను అన నచ్చును. ముసల్మాననినను క్రైస్తవుఁ డనినను అనవచ్చును! నేను జాతిని పరిగణించువాఁడను గాను—పరమహంస నని నమ్మము" అనెను.

"నీ వతి పామండుఁడవు!"

"అట్లని నాకు తాము జ్ఞాపకము చేయవలసిన అక్కఱ లేదు—ఏలనన, నింతకుమున్నే పల్వు రనుగ్రహపూర్వకముగ అట్లు నుడివి యుండిరి. ఎట్లుండి, ఎట్లైతినో ఇపుడు కూడ నాకు జ్ఞాపక మున్నది—రమాకాంతుఁడను నేనే!"

క్రోధముచే దయాలుని ముఖమంతయు రక్తవర్ణమై పోయెను. ఎట్లో అంతరంగమందలి భావము నణఁచుకొని "ఇపు డేమొనరింప నభిలషించుచుంటివి? సులోచనను వెంటఁ గొనిపోదువా!" అనియెను.

"చాలు! చాలు! ఎంతమాట సెలవిచ్చితిరి—ఆమెను గొనిపోయినయెడల మీకు ఇబ్బంది గలిగించినవాఁడనుగానా? రెండుపూటలు రెండింతలు పాప మామె ఉడకబెట్టుచుండ

తగుదునని మధ్యవచ్చి నిలుతునా? నేనంత నరాధముఁడను గాను సుడీ!"

ఆ దుర్మతివలన నెట్టి కీడు మూడునో యని యడలి, వాఁడొనరించిన పరిహాసమును మెల్లగ జీర్ణము గావించుకొని మెల్లని స్వరమున "అట్లైన నీకు కావలసిన దేమి?—మరల వచ్చితివేల?" అనియెను. హరిదయాలుఁడు.

"పైకము కావలసి విచ్చేసితిని. దారుణ దారిద్ర్యము సహింపలేక వచ్చితిని. రెండువేల రూకలు చేతఁబడినయెడల వెడలిపోదునని చెప్పుటకై వచ్చితిని"

"అంత మొత్తము నీ కెవ రొసఁగుదురు?"

"ఈయవలెనని ఎవరికి వాంఛ యుండునో, వారే యొసఁగుదురు. మీరే యిత్తురు!—మీరు గాకున్న సులోచన యల్లుఁడైనను యిచ్చును—అతఁడైశ్వర్యవంతుఁడు కదా"

ఆ గంతువుని తలబిరుసుతనమునకు దయాలుఁడంతరంగమున స్తంభితుఁడై పోయెను. అతఁడు ధూర్తుఁడనియు, చాతురీధురీణుం డనియుఁ గూడ గ్రహించి "బాబూ! నేను నిరుపేదను—అంతవిత్తము న్నేఁడుఁ గన్నులార చూచియైన నెఱుఁగను—కాని సులోచన యల్లుఁడు దాని నొసఁగఁగల డనుమాట వాస్తవము. ఇచ్చుటకు శక్తి యున్నను అతఁడీయఁడనుమాట కూడ వాస్తవము. అతని నీ వెఱుఁగవు—రెండువేల రూకల మాటటుండి, రెండుపైసల నైనను, ఎంత భయము చూపినను, ఎట్టి గంగవెఱ్ఱులు విజృంభింపఁజేసినను,

ఆతని చేతులనుండి యూడఁగొట్టఁజాలవు. నీవు బుద్ధిమంతుఁడవే యగుదువు!—కాని అతఁడు నీతలఁ దాటినవాఁడు. అందుచే మఱొక్క ఉపాయమేమైన చూచుకొనుము—ఈ ఎత్తుపడదు' అని హరిదయాలుఁడు నొక్కి వక్కాణించెను.

దయాలుని మొగముఁ దేఱి చూచి చిఱునవ్వాననముఁ దోప ఆగంతువు "ఎంతవఱకు సాధింపగలనో చూతును. యత్నే, కృతే—" అని ఏమో చెప్పఁబోవుచుండ దయాలుఁ డడ్డు వచ్చి "బాబయ్యా! ఇఁక ఊరకొనుము దేవభాష నిఁక అపవిత్రము చేయకుము" అనియెను.

"చిత్తము. అర్థము తెలిసినను తెలియకపోయినను కలఁగలుపు మంత్రముల నుచ్చరించుటకును, అమాంతంగా దేవభాషను మ్రింగివేయుటకును, మీరే సమర్థులు—సరే ఆమాటటుండనిండు. ఇఁక నేను సెలవు గైకొందును—అతని విలాసమేమో తెలుపుఁడు!"

"సులోచననే అడుగుము తండ్రీ!"

"ఆమె తెలుపదు—మీరే తెలిపి తీఱవలెను."

"అట్లొనరింపకున్న, నేమి చేయుదువు?"

"ఊరక తెగనీలుగుచున్నారు కాని మీరు తెలిపి తీఱుదురు—తెలుపనియెడల ఏమి చేయుదునో ముందే చెప్పియుంటిని గదా!"

దయాలుని ముఖము వెల్లనై పోయెను. "బాబయ్యా! నే నేమి చేసితిని? నాపై ఇంత కోపమేల?" అని యాతఁడు

ఖిన్నుఁడై పలికెను.

"అవును. మీా కేమియు చేయలేదు. అందుచేతనే ఇంచుక ఉపకారము చేయుఁడని మిమ్ము కోరుచుంటిని. మనిషిపేరు, ఇంటిపేరు చెప్పితిరేని అల్లునొకనూరు చూచి అనురాగపూర్వకముగ ఒకదీవన దీవించి వచ్చెదను. పిల్లదానిని గూడ చూచి వచ్చెదని——పాపము వెఱ్ఱితల్లిని చూచి చాలకాలమైనది."

దయాలుని గుండె దడదడలాడఁ దొడఁగెను. కాని ఇంచుక మేకపోతుగాంభీర్యము వెలిబుచ్చుచు, "నీకు నే నెట్టి సాయము పలుపను.——ఎంత యడిగినను, నీవుకోరు విలాసము తెలుపను. నీకిష్టమెట్లో, అట్లాచరింపుము. తెలియక జీవనములో ఒకపాపము చేసితిని——వలయు ప్రాయశ్చిత్తము చేసికొందును——నాకిఁక భయమేమి? అని గంభీరముగాఁ బలికెను.

"అవును భయమేల?——కాని శ్రాద్ధఘట్టమున తోడిపురోహితులనడుమ ఈవింతవిశేషము నేఁడే ప్రచారమగును. తదుపరి, వెతకి వేసారితివైనను సులోచన యల్లునికనుఁగొని అచట కూడ నీవార్త ప్రకాశమొనరింతును. బ్రాహ్మణోత్తమా! ఇఁక సెలవు——నమస్కారము"

అతఁడు పోవ నుద్యమించుచుండ, దయాలుఁడు చివాలున వానిచేయిఁ బట్టుకొని "నాయనా! నీవు ముప్పాతిప్పలు పెట్టి మూాడుచెరువుల నీరు త్రాగింపనిదే విడుచువాఁడవు కావని

బోధపడినది. కోపింపకుము. కరుణాళుఁడవై మన్నింపుము. దయయుంచి వీనులొగ్గి నేఁ జెప్పునది వినుము—ఈవిషయము గుఱించి నీవు ఏమియు అల్లరిచేయకుము. ఇదిగో! చూడుము, నీకాళ్లు కడుపు పట్టుకొనుచున్నాను. వారము దినములలో మరలిరమ్ము; నీవుకోరిన విలాసమొసఁగి నేఁ జేయగల సాయము చేసి తీఱుదును'' అని బ్రతిమాలెను.

"నేటివలె అపుడుకూడ వట్టిచేతులతో నన్ను త్రిప్పివేసిన యెడల మాటదక్కదని నమ్ముము."

తీక్ష్ణదృక్కులావింత మానిసిపై పఱపుచు దయాళుఁడు "బాబూ! నీవు నిజముగా బ్రాహ్మణుని కడుపున పుట్టిన చిన్నవాఁడవేనా?" అనెను.

"అవును—సందేహామేల?"

దీర్ఘనిశ్వాసమువీడి "ఆహా! తండ్రీ! వారముదినములలో మరలి రమ్ము.—ఈలోపుగనే అల్లరి చేయకుము సుమా తండ్రీ!—తెలిసినదా అని హరిదయాళుఁ డనెను.

"తెలిసినది'' అని ఆవ్యక్తి రెండడుగులు ముందునకువైచి తోడనే మరలివచ్చి "సరేకాని, అయ్యా! నాకు రెండుసూపాయలింకు. దురదృష్టవశాత్తు మనీపర్సు ఎచ్చటో జారిపోయినది! అని ఒకనవ్వు నవ్వెను.

హరిదయాలుని యొడలు రవులుకొని పోయెను. కాని మెల్లగ లోనికరిగి, రెండు రూకలు తెచ్చి నవ్వుచు నిలిచిన మహాశయుని చేతిలో నుంచెను. రూకలను రొంటి నిడికొని చల్లగ

నపుడతఁ డవ్వలకు దాటెను.

కాని హరిదయాలుఁడు నేల చతికిల పడెను.

౭

కాని సులోచన ఎచట? నిద్రాహారములను, పూజాగ్రంథ పఠనమును, యాత్రికుల యనుసంధానమును పూర్తిగ విడిచి మూడుదినము లు హరిదయాలుఁడు కాశీపురవీధుల నన్నిఁటిని గాలించెను. కాని విప్రవితంతువాతనికి గోచరింపలేదు. నిరాశజేసికొని దీర్ఘనిశ్వాసము విడచుచు "విశ్వేశ్వరా! ఇదేటిప్రారబ్ధము! ఒక యనాథయొక్క యగచాట్లను జూచి జాలిగొని ఆమెకాశ్రయమొసఁగి తుగకెట్టి కలుషపంకిలమునఁ చిక్కుకొంటినిః", అని యాతఁ డనుకొనెను.

ఆవీధిచివర ఈశ్వరదాసు యిల్లుండెను. హరిదయాలుఁ డచటికరిగి చూచెను.—తలుపు మూసియుండెను. "దాసూ దాదా! దాసుదాదా!" అని హరిదయాలుఁడు పిలిచెను.

ఎవరును జబాబొసఁగలేదు. దయాలుఁడు లోని చావడి లోని కరిగి చూచెను. దొడ్డివైపు వసారాలో దీపపు వెలుతురున నొంటిగఁ కూర్చుండి నిబిష్టచిత్తుఁడై దాసు చతురంగపు బలమును పేర్చుచుండెను.

"దాదా! ఒక్కడవు చతురంగ మాడుకొనుచున్నావా?"

అని దయాలుం డడిగెను.

దాసు కన్నెత్తి మిత్రునిజూచి ముదితహృదయుండై "బాబాజీ! రమ్ము—మొదటిఎత్తు ఎట్లు వేయవలయునో చూపుము. ఎత్తు నిలిచి తీఱవలెను" అనియెను.

ఆమాటకు దయాలుండు మిగుల విసుగుంజెంది, "జాతి నిలుచు ఎత్తేమో గోచరించుటలేదు కాని, చతురంగపుటెత్తు నిలుచు సాధనమెట్లు తోంచును?" అనెను.

ఈశ్వరదాసు కర్ణపుటములందుం గొన్నిమాటలుమాత్రము చొచ్చెను. "బాబాజీ! ఏమనుచుంటివి?" అని దాసనెను.

"ఆనాంటిసంగతి అంతయు వింటివా?"

"ఏ సంగతి?"

"ఆనాండు మాయింటజరిగిన అల్లరి సంగతి."

"ఆ యల్లరి ఏమో వినలేక పోతిని.—దాని శబ్ద మంత యధికముగాం దోపలేదు; కాని ఆనాండు నీఆట నెట్లు కట్టి వేయం గలిగితినో జ్ఞాపకమున్నదా?"

ముదసలిధోరణికిం గుపితుండై అంతరంగమున ఆతని మిక్కిలి దూషించి "ఆట కట్టివేసి నీవు నీప్రజ్ఞ చూపుకొన్న మాట నిక్కమే కాని లోనిగోల ఇంచుకైన నీచెవి సోకలేదా?" అని హరిదయాలుం డెనెను.

ఇంచుకసేపు యోచించి దాసిట్లనెను. "నాచెవి నేగోల గాని గోడుగాని సోకలేదు. మృదుస్వరమున నేమేమో ప్రాంగణమందనుకొని నపుడు, ఏమిజరిగెనో ఎట్లెఱుంగ జాలు

దును? కాని ఆనాఁడు మనఆట ఎట్లు తేలినో జ్ఞప్తియున్నదా? మంత్రిసాయమున నెట్లైన రాజును రక్షించుకొన వలెనని యోచించితివి—సరే, ఇప్పుడిటు చూడుము—నీజంతువుల నెట్లు నడుపుదువో చూపుము, ఎట్లైన నన్ను—"

వృద్ధుని దోరణికి విసుఁగుజెంది "జంతువు లన్నిటిని నట్టేట గలుపుము.—ఆనాటి మాటలేమియు నిజముగ నీచెవిని, బడనేలేదా?" అని దయాలుఁ డనెను.

హరిదయాలుని వివర్ణముఖ ముపలక్షించి, ఇంచుక అప్రతిభుఁడై దాసు "ఏమిచెప్పుదును బాబాజీ! నాకేమియు జ్ఞప్తికి వచ్చుటలేదు" అనియెను.

ఇంచుక నేవ్వూరకొని యుండి "అయితే దాదాజీ! ఐహిక విషయముల యెడ విముఖుఁడవై యున్నను, ఆముష్మిక విషయములదెస నైన సముఖుఁడవై యుందువా?—ఇహ మక్కఱలేకపోయినను, నీకు పరమైనఁ గావలసి యున్నదా?" అని దయాలుఁడు కోపముతో పలికెను.

"నిజముగఁ గావలసియే యున్నది."

అట్లైన ఆముష్మికసుఖమునకై ఎన్నఁడైన ఆతురపడితివా? ఒకనాఁడైన దేవాలయమునకు పోయిన పాపముఁ గట్టికొంటివా?"

ముదుసలి విస్మితుఁడై "ఏమనుచుంటివి బాబాజీ!—నే నెన్నఁడూ ఆలయమునకే పోలేదనుచుంటివా?—ఎన్నాళ్లు దేవమందిరమునకు పోయెడువాఁడనో నీవే యెఱుఁగుదువు!"

అనియెను.

"జపాగ్నిహోత్రపురాణపఠనములమాటటుండ, కాశీలో ఉన్న ఈ యిరువదేండ్లలో ఇరువదిదినము లైనను నీవు విశ్వేశ్వరాలయ దర్శనము చేసి యుండలేదు!"

"నీవు అట్లనిన నే నేమి చెప్పఁజాలుదును? ఆలయదర్శన విషయములో ఇరువదిదినములకు మఱికొన్ని దినములు కలిపి చెప్పుట నీకు న్యాయము—కాని, సంగతి ఏమో చెప్ప వలదా—సమయము లేకపోవుచుండుటవలన పూజాపునస్కారము లేమియు అగుటలేదు. చూడుము—ఉదయమే మన శంభునాథునితో కలసి ఒకఎత్తు వేయవలెను గదా!—పెద్దమనిషికి ఆటనేర్పు ఉన్నది. ఇరువుర సేనలు మడిసి, ఎవరిలో ఒకరము దరిచేరుసరికి రెండుజాములు దిరిగిపోవును! తర్వాత సంధ్యావందనపు ముక్కలు రెండు గొణిగి, రెండు మెతుకులు కుతకుతలాడించి, విస్తరిదగ్గఱ కూర్చుని లేచుసరికి ప్రొద్దు ఇదిగో, అదిగో అంటూ ఉండును! తర్వాత బాబాజీ! సంగా రాముఁడూ నేనూ కూర్చుంటే హోరాహోరి కదా మా పోరు! నీ వేమన్నను అనుము—చతురంగపు ఆటయందు వానికి మంచి నేర్పున్నది—మంచి ఎత్తులు వేయగలడు—ఆవేళ ఇంచుమించుగా ఆ పలుఁగు నాఆట కట్టివేసినాడు. గుఱ్ఱమూ, మఱి ఏనుగులు రెండూ రెండువైపులనుండి వచ్చి పడి—ఆహా! ఏమియెత్తు! ఏమియెత్తు!—"

"ఆ! దాదాజీ! చాల కష్టపడ్డావు కాని అపరాహ్ణా మం

తయు నేమి చేయుదువో చెప్పుము."

"అపరాహ్ణమందా! గంగారామునితో—ఆతని ఏనుఁగుల రెంటిని—రేపు చూచెదవు కదా ఆట ఎంత రమ్యముగా—"

దయాళుఁడు మిగుల విసుఁగుఁ జెంది ఆతని కడ్డువచ్చి "చాలు, చాలు, దాదాజీ! ఇఁక నూరకొనుము. అపరాహ్ణ సమయమున గంగారాముఁడును, సంధ్యానంతరమున ముకుంద శర్మ కచేరిచావడియు నిన్ను పట్టి వల్లార్చుచుండ, ఇఁక దేవుని దర్శనమునకుఁ గాని దేవరదర్శనముకుఁ గాని నీకు సమయ మేది?" అనియెను.

ఈశ్వరదాసు మిన్నకొనెను.

హరిదయాళుఁడు—దాదాజీ! ముదుసలి వైతివి. ఐహిక జీవనసంధ్య విలోకించుచుంటివి. అందుచే ఆముష్మికజీవనము గుఱించి నీవు మిక్కిలి యోచింపవలెను. చతురంగపు సేన లేవియుఁ గూడ రావు.

కడుపుబ్బ నవ్వుచు దాసిట్లనెను. ఈసేన లేమియు వెంట రావు—నీ వనినది నిజమే. ఇఁక తుదిపయనమునకు వలయు సన్నాహముగా నుందువా? అందులకు నేను సిద్ధపడియే యున్నాను. ఈశ్వరుని ఆజ్ఞ యైనపుడు ఏచింతయు లేక సాగి పోదును. అందులకై ఇపుడంత యోచింపవలసిన పని యేమున్నది?"

"ఏమియు యోచింపనే అక్కఱలేదా!"

"అక్కఱలేదు. ఏనాఁడు నను గన్న తండ్రి కమలాచర

ణుఁడు ప్రేమగర్భిత దృక్కులు నా మొగమున బఱపుచు, అటాత్తుగఁ గన్నులు మూసివై చెనో, ఆనాఁడే నా యోచనలు, చింతలు అంతరించిపోయెను!—ఎట్లా యంతము సంభవించునో బోధపడలేదు." అని చెప్పుచుండ వృద్ధుని కన్నుల నుండి అశ్రుధార లవిరళముగ స్రవింపసాగెను.

"ఇపు డా సంగతు లన్నియు నెందులకు?—నే జెప్పునది వినుము."

"ఏమో చెప్పుము."

దయాలుఁ డపు డానాఁటి యుదంత మంతయుఁ దెలిపి "ఇపు డుపాయ మేమి?" అని యడిగెను.

ప్రఫుల్లమై యుండు దాసు ముఖమండల మావృత్తాంతము వినినంతనే వివర్ణమై పోయెను: "హరిదయాలూ! అట్లు జరిగి యుండదు—సులోచన నిష్కళంకచరిత్ర. నిర్మలాత్మ. సావిత్రి వంటిది" అని యాతఁ డనెను.

"నేను కూడ నట్లే యోచించితిని—కాని వనితలను—నమ్మరాదు—వా రెన్నిటికైన సమర్థులు."

"ఛీ, అట్టిమాట లాడరాదు. పాపపుణ్యములు మనుష్య మాత్రు లందఱికిని సహజము. స్త్రీ పురుషులందు భేదము నా కేమియు గానబడలేదు. బాబాజీ! నీ జనని విషయము స్మృతికిఁ దెచ్చుకొమ్ము. దానిని పూర్తిగ మఱచిపోతివా?"

ఇంచుకసే పూరకొనియుండి విషణ్ణవదనుఁడై "కాని, ఇపుడు జాతిచ్యుతుఁడనై పోవుచుంటిని" అనియెను.

"పాప మొనరించితి వను భీతి యున్నయెడల, ప్రాయశ్చిత్తము గావించుకొనుము—కాని తెలియక చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము లేదా?"

"లేకేమి? ఉన్నది. కాని ఇచటివారంతయు నన్ను వెలివెట్టుదురు."

"వెలివెట్టిన నేమి?—"

హరిదయాలుఁడు మిగుల క్రుద్ధుఁడై "వెలివెట్టిన నేమని యానుడువుచుంటివి? బాగు, బాగు, దాదాజీ! ఇంచుక యోచించి మాట్లాడుము" అనియెను.

"బాబాజీ! యోచించియే మాట్లాడుచుంటిని—నీకు వయసు తక్కువలేదు—ఏబదియవపడి దాఁటిన దనుకొందును. ఇంత ప్రాయమువఱకు జాతి యున్నది కదా! శేషించిన రెండు మూఁడేఁడులు జాతి లేకున్న నేమి?—ఇఁక నీకు రానున్న ఉపద్రవ మేమి?"

"ఉపద్రవమే లేదా? కులము చెడును; మతము మంటఁగలియును; పరలోకమున కరిగి ఏమి జవాబు చెప్పఁగలను?"

"ఒక అనాథ కాశ్రయ మిచ్చితినని వచింపుము."

హరిదయాలుఁడు యోజింపఁ దొడఁగెను. వృద్ధుని వచనము లాతని మనసున కంతగ నచ్చలేదు. "అట్లైన సులోచన యల్లుని విలాస మీయవలదందువా?" అని యాతఁ డనెను.

"ఈయవలదనియే నేను నొక్కి వక్కాణించుచుంటిని. త్రాగుబోతగు ఒక పోకిరి గృహస్థుఁజేయుచు నిన్నదలించు

చుంటయు, పిఱికిపందవై గుండెలు కొట్టుకొనుచు పైకమునకై వాఁ డొక పెద్దమనిషిని పీడించుటకై నీవు చేయూఁత యొసంగుటయు నెంత చోద్యముగ నుండెనో నీ వొకమాఱు యూహించుకొనుము."

"చోద్యమో, మఱేమో ఎఱుఁగను. పైకము ఆవ్యక్తికి సాయము సలుపనియెడల నేను కడగండ్ల పాల్పడవలసివచ్చును. సంఘీయుల కండఱికిఁ గిట్టనివాఁడ నగుదును. శ్రాద్ధకర్మలకై ఎవ్వఁడును నాదాపు, జేరరు. నా బ్రదుకు తెరువే పోవును."

"మఱేమియు భయములేదు. సర్కారువారి కటాక్షమున నెలనెలకు ముప్పదిరూపాయల ఉపకారవేతనము వచ్చును నాకు. ఆపైకముతో కాశీపురమున ఏలోటు లేక మన మిరువురము కాలము గడుపఁజాలుదుము. కడుపునిండ కుడిచి, చదరంగ మాడుకొనుచు హాయిగఁ గాలము గడుపఁగలము."

"దాదాజీ! నాభారము నీవు వహించుటేల? లేనిపోని సంత తలపై నిడికొని నామతమును మంటఁ గలుపుకొని, కులమును గంగపా లొనరించి, కూడుగుడ్డలకు మొగమువాచినే నల్లాడుటేల? అంతకంటె—"

"అంతకంటె వా రింటిపేరును, ఊరుపేరును చెప్పి ఒక నిరీహాబాలికను పతినుండి తఱిమివైచి, సంసారమునుండి వేఱుచేసి, దురంతావమానమునకు గుఱిచేసి కృశీభూతమైన నీశరీర పంజరమందలి శల్యశకలములను శ్మశానసృగాలములనుండి రక్షించుకొనుట మేలు. బాబాజీ! రక్షించుకొనుము. కాని

ఈ విషయము నాదగ్గర చెప్పుటలో నీవు మంచి పని చేసితివి కావు. నా యాలోచనము గైకొన వచ్చితివి కాన నీతో మఱొకమాట చెప్పుచున్నాను. కాశీధామము అన్నపూర్ణ జనని పాలనమం దున్నది. మహాశయా! ఇందు వసించుచు పావనగుణశోభితలైన ఆమె దుహితల నెన్నంటి పీడింపఁ దలఁచితివేని నిజముగ నీ కమంగళము వాటిల్లును!"

హారిదయాలుఁడు కుపితుఁడై "వృద్ధ కోపముతో నామీఁద శాపవర్షము గురిపించుచుంటివా?" అనెను.

"బాబూ! నీవు కాశీవాసివి. శ్రాద్ధక్రియాతత్పరుఁడవైన పవిత్రబ్రాహ్మణుఁడవు. అంతియకాక కాశీనాథుని కప్పుడప్పుడు వాహన మగుచుందువు. నావంటివాని శాపము నిన్నంటఁ జాలునా?"

హారిదయాలుఁడు మొగము చిట్లించుకొని లేచి నిలువం బడెను.

"బాబాజీ! అట్లైన నామాట పాటింపవా?"

"పిచ్చివాని మాటను పాటింపవలెనన్న పిచ్చివాఁడను గావలెను."

ఈశ్వరదా సేమియుఁ బలుకక యిన్నకుండెను. హారిదయాలుఁ డవ్వలి కరిగెను.

ఆనాటి యామినీసమయమున హారిదయాలుడు తన కర్తవ్యమును గూర్చి దీర్ఘాలోచన చేసి తుద కొక నిశ్చయము చేసికొనెను. మఱునా డాతడు, చంద్రనాథుఁ డెవరితోడను ఆలో

చింపక పెండ్లి చేసికొనిన బాలిక కులభ్రష్టురాలగు ఒక స్త్రీ యొక్క కుమార్తె యని తెలుపుచు చంద్రనాథుని పినతండ్రి యగు మణిశంకరునకు హారిదయాలుఁ డొకజాబు వ్రాసెను.

౮

మణిశంకరునకు వ్రాసిన యుత్తరమందు హారిదయాలుఁ డన్ని విషయములు విపులముగ దెలిపెను. అందుచే నా యుదంత మనృతమై యుండదని మణిశంకరుఁడు విశ్వసించెను. కాని చేయవలసిన కర్తవ్య మేమో అతనికి తోఁచలేదు. అందుచే అంత నతఁడు తన అర్ధాంగి నేకాంతమునకుఁ బిలిచి యా చిత్రవృత్తాంతమును దెలిపి "నాతో నాలోచించి యున్న యెడల, నీ నిర్భాగ్యుని యవస్థ యిట్లై యుండునా? అయినను నీ వీవిషయ మెందును ప్రకాశ మొనరింపకుము. దీనిని బాగుగ విమర్శించు టుచితము" అనియెను.

కాని బాగుగ యోజింపవలెనన్న రెండు, మూఁడు దినము లుపేక్షింపవలసి యుండును. అంత గడువు నాకువారు సహింపఁ జాలరు. అందుచే హారిదయాలుని లేఖాంశము లచిరములో ఒకరిచెవినుండి ఇంకొకరి చెవికి బ్రాకి క్రమక్రమముగ నలుగు రాఁడువారలకు విదిత మయ్యెను. మణిశంకరుని కొమార్తెను పెండ్లికూఁతుఁ జేయునాఁడే హారిబాల పేరంటాండ్రమోల

ఆ విచిత్రోదంతము విని వెంటనే లలిత సదనమున కరుదెంచి శంకితస్వాంతయై ప్రాణపతి యర్ధాంగి నెట్లు ప్రేమించునని తన సఖ నడిగెను. ఆనాఁడు కూడిన మహిళాసంఘమున నీ ప్రశ్న అధికోత్సాహ పురస్సరముగ నాలోచిత మాయెను. ఏలనన, కేవలము అనురాగ గభీరతయందే లలిత భవిష్యజ్జీవనము నిహితమై యుండెనని ప్రథమమున వనితలే గ్రహింపఁ గలిగిరి.

ఎల్లఅ నడుమ గుసగుసలు బయల్వెడలెను. ముఖ్యముగ సంఘీయులగు స్త్రీలకు అధికోత్కంఠము కతన రెండుదినముల నుండి నిద్దుర పట్టుటలేదు. క్రమక్రమముగా వారముదినములు గడచిపోయెను. ఇంతదనుక రేఁ బవలులు కేఁవలము ధూమము మాత్రము వెల్వడెను! అనలశిఖలు బయల్పడలేదు. క్రమముగ పురుషసంఖ్యయందుఁ గూడ నీ వింతవిషయము తలయెత్తెను. కాని అల్పకాలము మాత్ర మట్లుండి అది యల్లన విస్మృతిని బడదొడఁగెను. ఏలనన, చంద్రనాథుని వంటి యైశ్వర్య వంతునిపై కత్తికట్టుటకై చాల ప్రయత్నము కావలసి యుండును. అందులకు నిలువబడు ప్రధాను డెవ్వఁడు కనబడ లేదు. ఏలనో మణిశంకరుం డీవిషయమున నించుకంతైన జోక్యముఁ గలుగఁ జేసికొనుచుండుటలేదు. అందుచే పురుషు లెల్లరు చప్పచప్పగ నూరుకొనవలసివచ్చినను ఇరుగుపొరుగు అమ్మలక్కలుమాత్రము మిన్నకుండఁజాలక కర్తవ్యమునకై నడుములు కట్టుకొనిరి. నిరపరాధులైన హరికాళి, ప్రజకిశో రుల జాతిమతములను గాఁపాడవలెనను పవిత్రేచ్ఛ బలముగఁ

బురికొల్పు, మెల్లగ హారికాళిని బిలిచి చెవిని వేసిరి.

హారికాళి విహ్వాలయై "ఏమి జరిగెను?" అని వారిని బ్రశ్నించెను.

వృద్ధాంగన యొక్కర్తుక "అమ్మా! ఏమిజరిగినదని చెప్పుదుము? జరుగవలసినదే జరిగిపోయినది" అని లలితాపరిణయోపాఖ్యానమును మొదటినుండి తుదవఱకు నేకరువు పెట్టెను.

ఆ కాహాని నామె తెలుపుతఱి మఱచిన ఒకటిరెండు విషయములను చెంతనున్న అంగనామణులు ఎఱుకపఱచిరి. ఉదంత మంతయు విని నిక్కముగ కొంప మునిఁగెనని హారికాళి గ్రహించెను. కాని తన ఆలోచనలు ఫలించుట కిదియే సువార్త యనికూడ నూహించెను. ఇఁక నామె తడయక ఏమో చదువుకొనుచున్న చంద్రనాథుని సమీపించి నిట్టూర్పు నిగిడించుచు నట గూర్చుండెను.

ఆమె ముఖచిహ్నములను విలోకించి, సంశయాకుల చిత్తుఁడై చంద్రనాథుఁడు "అత్తా! అట్లుంటివేమి?" అని ప్రశ్నించెను.

ఫాలతలమును గట్టిగఁ జఱచుకొని, గద్గదకంఠయై ఆమె "నాయనా! ఎంత నిర్భాగ్యులమైనను దైవము మన కిట్టి శాస్తి చేయవలెనా?" యనెను.

ఎందుల కామె యిట్లాడుచున్నదో గ్రహింపజాలని చంద్రనాథుఁ డామెనుజూచి హాతబుద్ధియై పోయెను.

"నాయనా! ఇంకేమున్నది? మా కొంప మునిఁగిపోయి నది. పట్టి దన్నముకొఱకు నీ యిల్లు చేరగనే కులము గంగ పాలై, మతము మంటఁ గలిసినది. పొట్ట చేతఁబుచ్చుకొని నీ యండఁ జేరకపోయినయెడల, నీవు మమ్మింతమట్టునకు తేఁగలవా తండ్రీ!"

చంద్రనాథుఁడు క్షణకాల మూరకొనియుండి ప్రశాంత భావమున "ఏమి జరిగినదో చెప్పుము" అనియెను.

తడిలేని కన్నులను తుడిచికొనుచు, హరికాళి "ఎవరి ప్రారబ్ధ మెవరు తప్పింపఁగలరు?—వెఱ్ఱితండ్రీ! నిన్ను మఱ పించి ఆ దుర్మార్గు లీపని చేసిరి." అని పలికెను.

"నీవు చెప్పెడి దేమో నాకు బోధపడుటలేదు. పదివేల నమస్కారములు. ఏమి జరిగినదో స్పష్టముగా తెలుపుము."

"ఏమి చెప్పుదును నాయనా! సంగతి ఏమో నీ పిన తండ్రి నడుగుము."

"అతనినే అడుగవలసినయెడల నాప్రోల నీ యంగ లార్పెందులకు?

"నాయనా! ఇంకా అంగ లార్పెందుకనుచున్నావేమి? మన కొంప మునిగినది తండ్రీ! అయ్యో!"—

అత్తమామలకు చంద్రనాథుఁ డెనలేని భక్తిశ్రద్ధలు జూపుచుండును. కాని హరికాళి మాటలధోరణి మనసునకు విసుఁగుఁ బుట్టింప, "కొంప మునిఁగియే యున్నయెడల మఱొక తావునకు పొమ్ము—నా ప్రోల నిట్టిమాట లాడ

వలదు" అని యూతఁ డనెను.

హరికాళి యప్పుడు చంద్రనాథుని మృతజననిని సంబో ధించుచు, ఉచ్చైస్స్వరమున "ఓ! వదినా! నీవు మమ్ములను తీసికొనివచ్చి ఆదరించితివి.—నేఁడు నీ పుత్రుఁడు తరిమి కొట్టుచున్నాఁడు" అని బొబ్బలు పెట్టుచు రోదన మారం భించెను.

చంద్రనాథుఁడు వ్యాకులచిత్తుఁడై, మేనత్తచేయిఁ గట్టిగఁ బట్టుకొని, "అత్తా! జరిగిన దేమో విప్పి చెప్పకున్నయెడల నా కేమి బోధపడును? మీ కొంప మునుఁగు టేమి?— కొండ విరిగి పై బడినట్లు రోదన మొనరించుచుంటివికాని, కలిఁగిన ముప్పేమో చెప్పకున్నావు" అనెను.

హరికాళి మఱొకమాఱు కన్నులుతుడిచికొని, "నాయనా! నీ కేమీ తెలియనే తెలియదా?"

"తెలియదు."

"కాశీనుండి మీ 'పండా' బాపడు మీ పినతండ్రి కొక జాబు వ్రాసెను."

"ఏమని వ్రాసెను?"

హరికాళి ఒకమాఱు గొంతు సవరించుకొని, తలయూపి "నాయనా! నిన్ను వంచనచేసి పిశాచి యొకతె నీ మెడ కొక వ్యభిచారిణిని కట్టఁబెట్టెను" అనెను.

విస్ఫారితనేత్రుఁడై చంద్రనాథుఁడు "ఎవరికి కట్టబెట్టెను?" అని ప్రశ్నించెను.

తలపై వడిగ మొత్తుకొనుచు "ఇంకెవరికి తండ్రీ!—నీకే!" అని ఆమె యనెను.

విస్మయచిత్తుఁడై మేనత్తదాపున నిలిచి చంద్రనాథుఁడు "వ్యభిచారిణి నెవరికి కట్టఁబెట్టెను?—నాకా?" అనెను.

"అవును తండ్రీ! నీకే!"

"అనగా, పెండ్లికిమున్నే లలిత వడుపువృత్తి నవలంభించి యుండెననియా? అత్తా! పదేండ్ల వయసునందే ఆపెను కాపురమునకుఁ దీసికొని వచ్చితిని—నీకు జ్ఞాపకములేదా?"

"నాయనా! నా కదేమి తెలియదు, కాని దాని తల్లికి కాశీలో చాల పేరున్నది!"

"అయినను లలితజనని వేశ్యావృత్తి సలిపెడిదా—లలిత కాదా?"

హరికాళి అంతరంగమున నుద్విగ్నయై "నాయనా! అనంతయు ఒకటేకదా! ఒకటేకదా!" అనెను.

"ఎవరిని ఏమని దూఱుచుంటివి?—అత్తా! నీకు మతి పోయినదా యేమి?" అని చంద్రనాథుఁడు గద్దించెను.

గద్దింపువిని, హరికాళి వెక్కివెక్కి ఏడ్చుచు, "మతిపోవలసినమాటయే, నాయనా!—మాయిద్దఱికిఁ ప్రాయశ్చిత్తము చేయింపుము—తర్వాత దైవ మేదారిచూపునో దానినిబట్టి పోదుము—ఇంతకంటె నాలుఁగిండ్లకుపోయి నాలుగింతలు ముష్టెత్తుకొనుట మంచిది" అనియెను.

చంద్రనాథుఁడు కుపితుఁడై "అవును! అదే మంచిది"

అనియెను.

"అట్లైన తండ్రీ! లేచి పోదుములే."

పెడమొగము పెట్టికొని చంద్రనాథుఁడు "పోఁడు" అనెను.

"అయ్యో! పాడుబ్రతుకు! నేఁటి కీగతి పట్టినదా?—ఏమి ప్రారబ్ధము!" అని రోదన మొనరింప సాగెను.

ఆమెదెస తిరిగి చంద్రనాథుఁడు "ఇప్పుడైన విప్పి చెప్పెదవా?" అనెను.

"చెప్పివేసితిని గదా"

"ఏమి చెప్పితివి?—ఉత్తరమేది?"

"నీ పినతండ్రి యొద్ద"

"అం దేమున్నది?"

"అదికూడ చెప్పివైచితిని గదా!"

చంద్రనాథుఁడు నేలపై నట్టె చతికిలపడెను. గభీరలజ్జా జుగుప్సలచే పదతలమునుండి, కేశాగ్రమువఱకు రెండుమాఱు లాతని యొడలు కంపించి, పక్షపడి ఱాతివలె అవలము గాఁ జొచ్చెను! "ఛీ!" యను ధిక్కారముమాత్ర మాతని నోటి నుండి వెల్వడెను.

హరికాళి ఆతని యాకృతిని దేఱిచూచినంతనే భయపడి మెల్లగ నందుండి నిష్క్రమించెను.

చంద్రనాథుఁడు—ఏది? ఉత్తరము చూపుము.

మణిశంకరుఁడు మెల్లగ పెట్టె తెఱచి యందుండి యొక జాబును పైకిఁదీసి దానిని చంద్రనాథుని చేతఁ బెట్టెను. అతఁడు జాబును రెండుమాఱులు చదివి, శుష్కముఖుఁడై "ఋజువేమి?" అని యడిగెను.

"రమాకాంతుఁడు స్వయముగ వచ్చుచుండెను—ఋజువేమో తెలియఁ గలదు."

"అతఁడు నిజమే చెప్పునని నమ్ముటెట్లు?"

"అది నేఁ జెప్పఁజాలను,—ఏమిచేయవల్సిన నీ కుచితమని తోఁచునో అతఁడు వచ్చిన పిదప కావింపుము."

"అతఁడేల వచ్చుచుండెను? ఈ విషయము ఋజువుచేసిన ఆతనికి కలుఁగు లాభమేమి?"

"లాభమేమో ఉత్తరమందు వ్రాయఁబడియున్నదికదా! అతనికి రెండువేల రూపాయలు కావలెనట.

స్థిరదృక్కులు పినతండ్రి ముఖముపైఁ బఱపి, "ఈ విషయము వెల్లడికాకుండ నున్నయెడల భయముఁ జూపి అతఁడాపైకముఁ గైకొనఁ గలిగియుండును. కాని యిపుడతని యాశ అడుగంటిపోయినది. ఒక విధముగా మీరు నా కుపకారమొనరించితిరి. అంత పెద్ద మొత్తము నా చేతులనుండి జారకుండఁ జేసితిరి" అని చంద్రనాథుఁడు పలికెను.

మణిశంకరుఁడు బిడియముచే తలయెత్తజాలక పోయెను. తా నేమియు వెల్లడికావింప లేకని పలుక నాతఁడుద్యమించెను. కాని తనమూలముననే నా గూఢోదంతము ప్రకాశమాయెనని తోడనే అతఁడు గ్రహించెను. అర్ధాంగికిఁ దెలుపకున్న, నది నిహితమై యుండెడిది!

చంద్రనాథుఁడు—పలుగాకియైన భిక్షుకుఁ డొకఁడు నా యూరున కరుదెంచి—నాయిలుసొచ్చి నన్నవమాన పఱుచుట కెట్లు సాహసించుచుండెనని యిమ్మెదుగను. కాని, పిన తండ్రిగారూ! ఇత్తఱి నామనుగడ కడముట్టిన యెడల, తాము మునితవ్యా దయులు కాఁ జాలుదురా యని యిమ్ము ప్రశ్నించు చున్నాను.

నాలుక కఱచుకొని "చంద్రనాథా! ఇట్టి మాటలు నోటి నుండి రానీయకుము" అనియెను.

"మీరు నాకు పితృసములు—పూజనీయులు, నా యం దేమైన దోషము లున్నయెడల, మన్నింపుఁడు. నా యాస్తి యంతయు వశ మొనరించుకొని, నా యెడల ప్రసన్నులు కండు. నే నెందున్నను, పొట్ట పోసికొనుటకై మాసమాసమునకు ఇం చుక పైకము నంపుడు.—అంతకంటె యిన్నగ నే నేమియు నపేక్షింపనని దైవసాక్షిగ తెలుపుచున్నాను."

పాపము చంద్రనాథుని కంఠము రుద్ధమై పోయెను; దంత ములచే నధరము నొక్కిపెట్టి లోపలినుండి యుబికి వచ్చు నా క్రందనస్వరము నాతఁడరికట్టుచుండెను.

మణిశంకరుఁడు లేచి నిలువంబడి, చంద్రనాథుని చేతులు పట్టుకొని "నాయనా! స్వర్గీయుఁడైన అగ్రజునకు నీ వొక్కఁడవు వంశధరుఁడవు. ఈ ముదుసలి నీఁక తిరస్కరింప వలదని వినీతుఁడనై నిన్ను వేఁడుచుంటిని." అని డగ్గుత్తికతో పలికెను.

పెడమొగము పెట్టికొని, కన్నీరుఁ దుడిచికొని, "తండ్రీ! మిమ్మెన్నఁడైన తిరస్కరించి ఎఱుఁగుదునా? కాని ఇట్టి దుర్భాగ్యము ఘటించిన పిదప దేశము పరిత్యజించుట కంటె నా కన్యమార్గమేమియు చూపట్టుట లేదు. ఆ విషయమే మీా కెఱిఁగించితిని." అని చంద్రనాథుఁడనెను.

"దేశముత్యజించి పోవుటేల? ఎఱుఁగక, ఇట్టి పెండ్లిచేసి కొంటివి. అందులకై ఇంతగా బిడియపడుటెందులకు?— ఒకమాఱు ప్రాయశ్చిత్తము మాత్రముచేసి కొనవలసి వచ్చునని తలఁచెద."

చంద్రనాథుఁడేమియు పలుకక మిన్నకుండెను.

ఉత్సాహ పురస్సరముగ మణిశంకరుఁడు మరల నిట్లు పలికెను. "అన్యమార్గము లేకపోవుటేల? కట్టుకొనిన ఆ పిల్ల దానిని విడచివైచి, ఒకమాఱు ప్రాయశ్చిత్తము, కావించుకొనుము.—పదపడి మరల పరిణయ మాడి సంసార సుఖమనుభవింపుము—ఇట్లొనరించితివేని, అన్నివిధముల నీకు మేలగును."

చంద్రనాథుని కాయము కంపించి పోయెను.

సంసారాభిజ్ఞుఁడైన మణిశంకరుఁడది లక్ష్యించి, స్థిరదృక్కుల నాతనిపై సారించుచు అట్లే యుపవిష్టుఁడై యుండెను.

"తండ్రీ! అర్ధాంగిని పరిత్యజించుటకు నా యుల్లమొప్పు కొనదు!"

"కులట కడుపునఁ బుట్టినది కులవంతుల కర్ధాంగియై యెట్లు మనఁ జాలును? ఆమెను పరిత్యజించుట నీ కసాధ్యము కాదు. నేఁడు పోయి విశ్రమింపుము.—సుస్థిర చిత్తుఁడవై రేపు బాగుగ యోచించి చూడుము. ఈ కృత్యము, నీకు కష్టముగ దోపదు. ఆ పిల్లదాని, నిఁక నొక నిముసమైన నింట నుండ నీయరాదు."

"కాని ప్రమాణమేమియు బయల్పడకమున్నే పరిత్యజింపుమని ఆజ్ఞాపించుచుంటిరేల?

ఇంచుక యోచించి, మణిశంకరుఁడు "అధిక ప్రమాణము కాకుండు మార్గముచూచెదను. తక్షణమే నీవా కులటాపుత్రికను పరిత్యజించి తీరవలెను. పరిత్యజించి, ప్రాయశ్చిత్తము చేసికొంటివేని అల్లరి అంతయు అడఁగిపోవును." అనియెను.

"అణఁచు వారెవరు?"

"నేను!"

"కాని, ఇంచుకంతైన విమర్శింపక—"

"అంతగా విమర్శింపవలెనని వాంఛించితివేని పదఁపడి విమర్శింపుము. కాని, ఈ యుదంత మనృతముకాదని నొక్కి చెప్పఁగలను."

చంద్రనాథుఁ డింటికి మరలివచ్చి, నిజాగారముఁ జొచ్చి కవాటము బంధించివైచి, పల్యంకముపై బోరగిలపడిపోయెను; హృదయావేగము సహింపఁజాలక పానుపుపై దొరలి పడం పడి ఊర్ధ్వముఖుఁడై పన్నుండి శూన్యదృక్కులఁ బైకి సారించుచు, నిదురయందు మానవుఁడు పలవించు లాగున "లలితా నిన్ను విడువవలెనా? నీవు కులటకడుపునఁ బుట్టితివా?" యని పలుమారులు పలుతెఱఁగుల పలికి చెవియొగ్గి ఆ నుడువులను వినసాగెను. కాని ఎన్నిమారులు లుచ్చరించినను, ఎన్ని మారులు వినినను, ఆ పలుకుల నాతఁడు హృదయంగమము కావించుకొనఁజాలక పోయెను. లలిత నతఁడు త్యజింపరాదు, నిలయమందుగాని, ఆగారమందుగాని, కన్నులెదుట గాని వెనుకగాని, ముందుగాని ఆమె కానంబడరాదు. ఇఁక నామె అతని లలిత కాదు! ఆ యుదంతము యదార్థమో, విపరీత సంయుతమో లేక మఱెట్టిదో యని శక్తివంచనలేక ఎన్ని మారులు యోచించినను, అతనికి బోధపడలేదు. ఎట్లైనను ఆయనది నవ్వాలకుఁ దోలివేయవలెను!—ఆ నిర్వాసనము నిష్ఠురమైనది కాదని మణిశంకరుఁడు నొక్కి వక్కాణించెను. అది నిష్ఠురమో కాదో,—కావింపఁజాలునదో, జాలనిదో, గ్రహించుటకు వలయు శక్తి మనుష్యహృదయ మందుండెనో లేదో అతఁడెఱుఁగఁ జాలకుండెను. నిర్జీవమానవుని మాడ్కి పడియుండి చంద్రనాథుఁడు కొండొక వడికి నిద్రామగ్నుఁ డాయెను. నిముసములో అతని మనసు స్వప్నభూనియందుఁ

గొట్టుకొని పోయెను. అత్తఱికూడ ఆతని రక్తనాళములనుండి యొక యస్పష్టవ్యథ ఉత్పన్నమై, ఆతని కాయమును గంపింపఁజేసెను. సంధ్యాసమయమున నాతనికి నిద్రాభంగమాయెను. కన్నులు నులుముకొనుచు చంద్రనాథుఁడు లేచి కూర్చుండెను. ఆతని మానసికావస్థ భ్రాంతిగా మాఱిపోయెను. అనురాగోజ్జ్వలతగాని, క్రోధపంకిలముగాని, ఘృణాతమసముగాని అందులేవు. కేవలమొక లజ్జాభారమాతని చిత్తశరీరములను గ్రుంగఁదీసి వేయుచుండెను.

దీపముఁగైకొని యప్పుడు పరిచారకుఁ డావలఁదలుపుఁ దట్టెను. లేచి తలుపుఁ దెఱచి చంద్రనాథుఁ డాగారమున పచారము చేయసాగెను. అతని సుషుప్తి భారము సడలి పోయెను. మరల చింతాస్రోతము ఖరవేగమున నాతని చిత్తవీథిని ప్రవహింపఁ దొడఁగెను. ఆ యుదంతయు నిక్కమై యుండునాయనియు, లలిత దాని నెఱిఁగి యుండునాయనియు అతఁడు తల పోయసాగెను. ఇఁక నందు నిలువఁ జాలక చివాలుఁ చంద్రనాథుఁడు నిజాగారము వీడి ద్రుతగామియై అర్ధాంగి శయన మందిరమున బ్రవేశించెను.

సంజదీపము వెలిగించి లలిత కూర్చుండెను. పతి యరుదెంచుట విలోకించి సంభ్రమపూర్వకముగ నామె లేచి నిలువఁబడెను. ఆమె ముఖపుండరీకమున భయముగాని ఉద్వేగచిహ్నముగాని లేదు. చెప్పనేల? ఒక బిందువు రక్తమైనను అందులేనట్లు చూపట్టెను.

చంద్రనాథుఁడు—వృత్తాంత మంతయు వింటివా? నత వేదనయై లలిత ‹‹వింటిని›› అనెను.

‹‹అంతయు నిజమేనా?››

‹‹నిజమే!››

చంద్రనాథుఁడు చివాలున పాన్పుపై చతికిలఁబడి ‹‹ఇన్నాళ్లనుండి చెప్పితివి కాదేల?›› అనెను.

‹‹మా అమ్మ చెప్పవలదని నొక్కి పలికినది. మీరుకూడ అడుగలేదు.››

‹‹నే పలికిన ఉపకారమునకు ప్రత్యుపకృతి యిదియా?››

మా తేమియుఁ బలుకక, అధోముఖయై లలిత అట్టులే నిలువంబడి యుండెను.

‹‹ఏల నీవంత భయముచే మసలు చుండెడిదానవో నా కిపుడు బోధ పడినది. ఇంత ప్రేమించినను, ఏల నాకుసుఖము చేకూర కుండెనో ఇపుడు తెల్లమయినది. ఇందు చేతనే కాఁబోలు ఎంత వేడినను, నీతల్లి యిచటికి వచ్చుట కిష్టపడ లేదు.››

నతముఖయై లలిత మెల్లగ "ఔ" ననెను. ముహూర్తములో గత విషయము లన్నియు చంద్రనాథుని స్ఫురణకు వచ్చెను. తాను వారణాసి కరుగుటయు, యౌవనమున వితంతువైన సులోచన సౌందర్య సౌష్ఠవములును, కృతజ్ఞతా వ్యంజకములై, సలిల పూరితములైన ఆమెనయన సరోజములును, అయుటిన స్నిగ్ధశాంత ప్రసంగమును, అటాత్తుగ నాతని చిత్త

దిగ్వాలయమున జూపట్టెను. కన్నీరు కాల్వలై పాఱ చంద్ర నాథుఁడు, „లలితా! ఉదంతమంతయు, దేట తెల్లముగ దెలుపఁజాలుదువా?" అని తన యర్ధాంగి లక్ష్మి నడిగెను.

„తెలుపఁ జాలుదును. మాతల్లియొక్క పుట్టినిల్లు నవద్వీప మునకు సమీపమందుండెను. రమాకాంతుని గృహము మామేనమామ గారింటి సమీపమందే యుండెడిది. బాల్య కాలమునుండి మా అమ్మ అతని యెడ ప్రేమతో నుండెడిది. చెప్పనేల? పెండ్లిమాటలుకూడ జరిగిపోయినవి. కాని ఋషు లలో ఒకరిద్దఱు కలయుటచే ఇరువురకు పరిణయము కాలేదు. నా జనకుని యూ[illegible] వా[illegible]నము. నాకు మూఁడేండ్ల ప్రాయ మప్పుఁడు నా తండ్రి పరమపదించెను. తోడనే అత్తవారి యిల్లువీడి మా అమ్మ పుట్టింటికి మరలివచ్చెను. నాకైదేండ్లు యీఁడు రాఁగనే నన్నుదోడ్కొని ఆమె యిల్లువీ—"

„తదుపరి?"

„తదుపరి కతిపయ దినములు మేము మధురయందుం టిమి. అందుండి బృందావనమున కరిగి, పిదప కాశీ చేరు కొంటిమి; వారణాసి రాఁగనే రమాకాంతుఁడు సురాపాన మున కలవాటుపడెను. మాఅమ్మయొంటిని కొలఁది మాత్రపు నగలున్నవి.—వాని నిమ్మని రమాకాంతుఁడనుదిన మామెను పీడించుచు, ఇంటఁ బోనుపెట్టునాఁడు. పదంపడి ఒకనాఁటి యర్ధనిశీథమున ఆ దుర్మతి నా జనని భూషణములనే కాక, ఇంటి యందున్న అన్యపదార్థములను గూడ దొంగిలించుకొని పాఱి

పోయెను. అప్పుడు మాచేతియం దొక చిల్లి గవ్వయైన లేదు. గంగాఘట్టమునఁ సూర్యుని యాత్రికులను భిక్షవేఁడి లభించిన తండులములచే ఎట్లెట్లో పొట్ట పోసికొనెడి వారము. తదుపరి యుదంతమును మీ రెఱుంగుదురు.

చంద్రనాథుని హృదయకరండమున అగ్నిశిఖలు ప్రజ్వ రిల్లెను. అవనతాననయైన అర్ధాంగిపై క్రూరదృష్టులు పఱపుచు "ఛీ! ఛీ! లలితా నీవిట్టిదానవా?—నీవంశ మిట్టిదా? అంతయు నెఱిగి యుండియు, నీవు నాకిట్టి చెట్టఁ దెచ్చితివా? నీవిట్టి పాపిష్ఠురాలవని స్వప్నమందైనఁ దలఁపఁ జాలనైతిని" అని యాతఁడు నిష్ఠురోక్తులు పలికెను.

లలిత కన్నులనుండి బాష్పశైవలినులవారిగ ప్రవహింప సాగెను. అవనతవదనయై ఆ యువిద యట్టులే నిలువంబడి యుండెను.

చంద్రనాథుఁ డా బాష్పవర్షము వీక్షింపఁజాలక పోయెను. కోపోద్దీపితుఁడై, కఠోరస్వరమున నాతఁడు "పాపిష్ఠిదానా! ఇప్పుడింక చేయవలసిన దేమి?—ఉపాయ మేమైన చెప్పుము" అనియెను.

చేలాంచలిచే కన్నులు తుడిచికొనుచు, "మీరే చెప్పుడు" అని వినీతస్వరమునఁ బలికెను.

"అ[illegible]మ్ము."

నతమస్తకయై లలిత పతిచెంత [illegible] చంద్రనాథుఁ డామె కరపల్లవమును గట్టిగఁ బట్టుకొని, "నిన్ను పరిత్యజించి

వేయవలెనని లోకులందఱు ఏకగ్రీవముగఁ బలుకుచున్నారు. కాని ఆదుండగమునకు నాయెడద అంగీకరించుటలేదు.— నిన్నింక నమ్మఁజాలను. నావిశ్వాసమంతయు నిముసములో నీటఁ గలసెను" అని కటుస్వరమున పలికెను.

ముహూర్తములో లలిత వివర్ణపాండురముఖమున విచిత్ర రక్తాభ మెఱసెను. అశ్రుమలినములైన ఆమె కన్గవలు నిముసములో విద్యుద్ద్యుతిమువోడ్కి తళుక్కుమనెను. "ఏమనుచుంటిరి? నన్ను నమ్మఁజాలరా!" అని భయపహితయై ఆమె భర్తనడిగెను.

"నమ్మఁజాలను.—నీవెంతటికైన తగినదానవు"

పతి వదనమున నొంత నిదానమునిడి, అవిచలితస్వరమున లలిత యిట్లనెను: "మీరు నాకెట్టివారో మీకే ఎఱుఁగుదుగ! ఉత్కృష్ట దాంపత్యతత్త్వము గుఱించి ఉపాదిష్టిది మీ మోల నేను తెలుపఁజాలను. దైవమున కేమిధారవోసి నను పోయవచ్చును. నావంకఁ దేఱిచూడుమని మీకొకప్పుడు నన్నడిగితిరి. నేఁడు నామోమునదెన అనిమేషలోచనులై వీక్షింపుఁడని మిమ్ము వేఁడుచుంటిని. ఇప్పు మపాయమేమని అడిగితిరి కదా! ... ... అందుకు సమ్మతింతురా!"

"నమ్మ... ...—అదేమో చెప్పుము."

"నేను విషమ్ము ద్రాగి ముకిసిన మొదలు, నీ యశాంతి యంతరింపదా!"

అర్థాంగి కరపల్లవము నంటియున్న చంద్రనాధుని కరము

చివాలున కంపించిపోయెను. గద్గదస్వరమున నాతఁడు,, ఆహా! లలితా! విషము—తాగి—గలవా? అయ్యో! హృదయము— అని యేమో అనఁ బోయెను. కాని ఆతనిస్వరము చివాలున రుద్ధమయ్యెను.

,,త్రాగఁ గలను. నిస్సంశయముగా త్రాగఁ గలను."

చంద్రనాథుఁ డేమో యనఁబోయెను; కాని వాని నోటి నుండి మాట వెల్వడలేదు.

,,గరళము త్రాగఁ గలను—నామాట నమ్ముఁడు."

,,ఎవ్వరికిఁ—దెలియకుండ—గూఢముగ"

,,గూఢముగనే త్రాగుదును."

,,నేఁ—డే!"

,,మంచిది!—నేఁడే త్రాగుదును"

చంద్రనాథుని శరీరము కంపించిపోయెను—ఆవే[illegible] ఎడద దడదడఁ గొట్టుకొనియెను. కంఠమునుండి వెడలినచ్చు రోదనము నతికష్టమున నడంచుకొన యత్నించుచు చంద్రనాథుఁ డంమండి నిష్క్రమింపఁ బోయెను. తోడనే ఆతని యర్ధాంగి పతిప్రేమాల సాగిలపడి నిజహస్తనాళీకములచే ఆతని చరణంబులను గట్టిగఁ బట్టుకొని ,,పోవుతటి ఒక నాశీర్వాదము [illegible]ముచేయరా!" అని వినీతస్వరమునఁ వేఁడెను.

చంద్రనాథుఁ డీమాట హృదయమున నాటుఁ జేసి కొనెను. ఊర్ధ్వదిక్కుగ దృక్కులు పఱపుచు ,,ఇప్పుడు కాదు! శరీరమునుండి నీప్రాణ మెగసి పోయినపుడు. మృతకాయము

...మై భస్మమైనపుడు ఆశీర్వాదము కావించును" అని ... దెను.

ప్రాణవతి పరద్వయమును విడిచిపెట్టి, అధోవదనయై లలిత, "మంచి కట్టే కావించుము!" అని వినమ్రయై పలికెను.

... నుస్వయించుచుండ, లలిత మహోకనూలు ... టమున కన్నుగ వెనుదిరిగి నిలిచి "విషము మింగి నేను మరణించిన మొదల, మీకెట్టి ఆపదయు కలుగదు కదా" అని గద్గదకంఠయై పలికెను.

"నా కేమియు కలుగదు."

"ఎవరును మిమ్ముగు గురించి సంశయింపరుకదా?"

"నిశ్చయముగ సంశయింతురు. కాని పైక మొసగి లోకుల నోళ్లు కట్టివేయుదును."

"ఉత్తర మొకటి వ్రాసి పఱపుక్రింద పె... ... ప్రజలకు దానిని చూపుము."

పత్ని వ్రేాల కందించి, ఆమె మస్తకమున చేయిపెట్టి యిట్లనెను. "మంచి కట్టే చేయుము. లేట ... వ్రాసి, జాబుచివర స్పష్టముగ వ్రాలు చేయుము. అట్లొనరించితివేని నిన్ను హాత్య గావించితినని ఎవ్వరును సంశయింపరు. మహోక మాట.—వెలుప ... యు శబ్దము వినబడకుండుటకై ... గాఢుగ లోపల మూసిపెట్టుచు కొనుము.—ఏ మూలుగును నా చెవిని బడరాదు."

కవాటమునుండి కదలివచ్చి లలిత మహోకమాలు పతి

పదములకు సాష్టాంగప్రణామమిడి, హృదయేశు పాదధూళి శిరమునదాల్చుకొని లేచి నిలువంబడి „ఇఁక ఉండిపోదును” అని, ఏదియో సందియము మనసునఁ దోప ప్రాణపతి కరమును ఆవేగభరమునఁ బట్టికొని, „ఆగుము—ఇంకొక నిముసము తాళుఁడు” అని వచించి, దీపమును సమీపమునకుఁ గొనివచ్చి, ప్రియుని ముఖమును దేఱిచూచి చకితయై పోయెను. చంద్రనాథుని నయనయుగళమున నొక యమానుషతీవ్రద్యుతి, ఉన్మాదావేశుఁ డైనవాని దృష్టి కైవడి తిరుగు తళుక్కున మెఱసెను.

„లలితా! కన్నులం దేమి చూచుచుంటివి?” అని చంద్రనాథుఁ డనెను.

క్షణకాల మూరకొనియుండి పిదప—„ఏమీ లేదు—ఇఁక నేను వెనుక కుండిపోదు” నని లలిత పలికెను.

చంద్రనాథుఁడు మెల్లగ నవ్వలి కరిగెను „అట్లే యగుగాక!—అట్లే యగుగాక!—నేఁడే” అని మెల్లగ ననుకొనుచు అతఁ డదృశ్యుఁ డాయెను.

## ౧౦

ఆరాత్రి లలిత ఏకాంతమున గూర్చుండి అకస్మికముగఁ దన కాపాదించిన దుస్థితికి కడుపొగిలి హృదయేశుని సంఘీయుల

దానినుండి కాపాడుటకు నిశ్చయించి ఆత్మహత్యకుఁ దల పడెను.

ఆహా! స్త్రీసాహస మెంత యద్భుతమైనది!—ఎంతటి చెయువునైనఁ జేయుటకు వారు వెనుదీయరుకదా! ఉత్తమ చిత్తలైనతటి ఉదిరి లెట్టి దారుణమునకైన నడుముఁ గట్టుదురు కదా!

పతియాన నౌకలఁ దాలిచి, ఆగారకవాట వాతాయన ములను బంధించివైచి విసము గ్రోవఁ దలంచి నిమీలిత నేత్రయై ఈశ్వరుని ధ్యానించి లలిత విషపాత్రికను జేఁ బూనెను!—కాని ఆమె కరము కంపించిపోయెను!—విసము నకై వేచిన ఆమె యధరముకూడ వడఁకెను!—అంతరంగ మున రేఁగిన యాందోళన మామెకు శృతిగోచరమాయెను! లలిత గర్భగోళము సంక్షుభితమాయెను! చేతినుండి విషపాత్రము దీసి, ప్రొంత నిడి ఆవామాక్షి ఇట్లు వాపోవ దొడఁగెను: "దైవమా! ఇదేమిబుద్ధి! నా జీవనములపై నా కధికార మున్నదికాని ఉదరమందలి నిసుఁగుయసువు లపై లేదుగదా! పతి మానరక్షణార్థము నా ప్రాణములఁ ద్యజింపఁజాలుదును; కాని ఈ పిండమునుగూడ నాతో నెటుల నాశన మొనరింతును? నే నోర్తుకను కానుగదా! జననిని కాఁబోవుచున్నాను. శిశువు నెటుల హత్య గావింపఁ గలను? అయ్యో! హాలాహలము చేఁబూనినంతనే అంత రంగమునుండి హాహాకార ముత్పన్నమాయెను! ఈ భ్రూణ

హత్య గావింపఁజాలను. దైవమా! నీ యిచ్ఛ ఎట్లో అట్లొనరింపుము. నేను నిరీహను!" అని చివాలున నామె నేలఁ గూలెను. గరళపాత్రి యొక్కచో దొరగిలపడియెను!

లలిత మరణింపఁజాలకపోయెను. కాని ఆమె సుఖదినము లొక్కమారుగ అంతరించిపోయెను!

గభీరనిశీథమున ఎట్లో తలుపుఁ దెఱచుకొని చంద్రనాథుఁడు శయనాగారముఁ బ్రవేశించి, నేలఁ గూలి వాపోవుచున్న అర్ధాంగి నావేగపుతన్నరముగ లేవదీసి నిజవక్షమున నామెనుహత్తుకొని, అస్ఫుటస్వరమున "లలితా! ఎన్నఁడు నిట్టి ఘాతుకమునకుఁ బాల్పడకుము! ఇట్టి దారుణమునకు—కలపడకుము!" కాని అంతకన్న నతఁ డేమియుఁ బలుకఁజాలకపోయెను! దుర్భరదుఃఖజలధిని మునింగియున్న ధర్మపత్నికతఁ డట్టియూనను గొలుపలేఁడు. అతులైశ్వర్యసంపన్నుఁడైన చంద్రనాథుఁడు నిజ విశాలదివ్యభవనమున, ప్రాణమునకుఁ బ్రాణముగాఁ బ్రవర్తించిన కళత్రమునకు,—నేఁడు హతభాగిని యైన సహభాగినికి, లజ్జాకజ్జలపాంశుముఖమును మఱుఁగుపఱచుకొనుట కించుకంతైన నేమూలనైన తావు నొసగలేకపోయెను. "ఇఁకేదిగతి ప్రాణప్రియా!" అని దుఃఖతప్తహృదయవేదనమున ఆ యభాగిని నలవల వాపోవుచుండ ఆగా... కరగి నీరాయెను. కాని, చంద్రనాథుని సంక్షుభితి అంతరించిపోలేదు! రేఁబవలులు క్రుక్కుచు, తన మనమున్న వ్యాధియు ముసు శాంతిపఱచి ఆదరించు పుణ్యమునకు బోయిన దెవ్వ

రీయూరను లేరయ్యెను. ప్రియుని దెస దీనదృక్కులు పఱపుచు, కడవలకొలఁది కన్నీటినివిడుచుచు, కడుపు పగులున ట్లాకాంత చాలసేపు వెక్కి వెక్కి యేడ్చి "నాథా! ఇం దుండుటకు నా కీకుటీరమును గుప్పుమాత్ర మొసఁగుఁడు" అని ప్రాణపతిని ప్రార్థించెను. చంద్రనాథుఁ డట్లే ఆ వేడికోలును మన్నించెను. శ్రావణమాసపు ఈ కడపటి వారముదినములు మగని యాశ్రయమం దెట్టులో తల దాఁచుకొని, పదపడి నిరాశ్రితయై, క్షుత్పిపాసలకు నరవర్తినియై పథములందు బిచ్చ మెత్తుకొనుచు, జీవచ్ఛవమై, బూది యగునందాక ఎముకలప్రోవగు దన కాయము నామె నిలుపుకొనవలయును! శ్రావణమాసమున ఇంటియాఁడలి కుక్కలనైనను వెళ్ల [illegible]ను అవ్వలకు తగుమానను శాస్త్ర మొకటి యున్నది కదా! అందులకు విరుద్ధముగ నాచరించినచో పవిత్రులైన గృహస్థుల కమంగళము ప్రాపించును. అందుచే లలిత ప్రార్థన మన్నింపఁబడియెను.

రెండుమూఁడు దినములు గడచిపోయెను. లలిత కాయము నుండి ప్రాణకుంతము పాఱి చనలేదు. కట్టెవలె ఆకాంత యింటి మూల పడియుండెను.

ఒకనాటి సంధ్యాసమయమున తానున్న యెడకు దాపున పెనిమిటి యడుగుల యలికిడి విని చివాలున లేచి లలిత ఎప్పటి యట్లు భక్తిపూర్వకముగ భర్త యాగ్రహిణ్యయమున కేరలి వని పవిత్రపాదరజమును నిడొలఁదాల్చి, లేచి నిలువం

బడి తన కోమలకరపల్లవముల నాతని హస్తమృణాల
ములఁ బట్టి వినమ్రయై వినీతస్వరమున నామె యిట్లనెను.
"ప్రాణప్రియా! నొసటవ్రాసి యున్న దేదో, జరుగక తప్పదు. నా ప్రారబ్ధము నేననుభవింతును—నా కొఱకై మీరు వందుర వలదు. నా వంటి పాపిష్ఠురాలికి చెంత తావొసఁగి కడలేని కడగండ్లకు పాల్పడితిరి. దుస్సహమైన యవమానమునకు లోనైతిరి. ఈ పాడుకట్టె యిలువీడి చనినంతనే మీ యిడుములు కడముట్టును. మీ యొప్పటి గౌరవము మీకు చేకూరును. నే నవ్వలికిఁ జనినంతనే సుశీల నోర్తుకను పరిణయమాడుడు. కాపురము మరలఁ దిన్నఁ బెట్టుకొనుఁడు!"

చంద్రనాథుఁడు నతముఖుఁడై, నిరుత్తరుఁడై యుండెను.— జవాబేమి చెప్పుటకు అతనికి తోఁచలేదు. కాని, కొలఁది దినములనుండి తనపత్ని కించుక వాచాలత్వము కలిఁగెనని అతఁడంతరంగమున నూహించెను. పూ [illegible] క ఆమె ఇప్పుడించుక ఎక్కుడుగ ప్రసంగించుచుండెను. ఇంతవఱక ఆమె యెద [illegible] యందఁడగి యున్న భా [illegible] వంతరించి పోయెను. కొలఁది మాత్రపు దినములకు మున్ను గూడ ఆమె యప్రశాంతము అవగుంఠనముఁ దాలిచి మోమును మఱుఁగు పఱచుకొనుచు, నింట మసలుచుండెడిది. తన భర్త యీవల ఱొగసి పోవునేమో యనియు, పాశాత్తు [illegible] నరైన గుఱుతింపఁ జాలుదురేమో యనియు పిల్లవాయువు వీచినపుడు కూడ ఆమె యట్లె యులికిపడుచుండెడిది!—

ఇపుడట్టి భయమదృశ్యమై పోయెను. అందుచే ఆమె భయరహితయై ప్రసంగించుచుండెను. ఇహజీవనము నామె తనదియని గర్వముతో జెప్పుకొనఁజాలు దానిని—తన సర్వస్వమైన జీవితేశుని సంఘన్యాయస్థానమున జారీయైన ఉత్తరువు చొప్పున శోకులామె కడనుండి యీడ్చుకొనిరి.—ఇపుడామె సర్వవిముక్తయయ్యెను. సన్యాసిని యయ్యెను. అందుచే ఇపుడామె ప్రియునితో స్వచ్ఛందముగ ప్రసంగించుచున్నది. నెచ్చెలిక్కై వడి ఉపదేశమొసఁగుచు, ఇంకక గొంకక తన తలఁపుల నాతని ప్రేమాల నామె వెలిబుచ్చుచున్నది.

ఎప్పటివలె గాక మఱునాఁడు హరికాళి రేవకడ నిదుర మంచముపుండి లేచి, లెమ్మని మగనిచఱచి, తెల్ల కాకితమొకటి అతని చేతబెట్టెను. నివ్వెరపడి అతఁడు పత్నిదెస అనిమేషలోచనుఁడై వీక్షించుచుండ, నింతలో ఆమె యొక అగా ... కాకితముపై అంటించి, కలమొకటి పతిచేతికిచ్చి నేఁ జెప్పినదేమో వ్రాయుఁడని ఏమో చెప్పదొడగెను.

ఒక మాఱు కన్నెత్తి వ్రజకిశోరుఁడు "ఈ వ్రాత ఎందులకు?" అనియెను.

ఒకమాఱు కన్నులెఱ్ఱఁజేసి, కంఠమెత్తి పతినుద్దేశించి ఆమె యిట్లనెను. "అవగింజంత బుద్ధి మీకున్న మొదల ఇట్లు అడిగి ... . ఈ వఱలో ఒకమాఱు న ... పెడచెవిని పెట్టి ఇంత చేసినారు. ఇఁక నే విషయములోను మీ బుద్ధి కుశల ... డు." వ్రజకిశోరుఁ డిఁక తిక్కురు

మనక, మంచిపిల్ల వానివలె పెండ్లాము చెప్పుదానిని వ్రాయ దొడఁగెను. జాబు వ్రాయుట ముగియఁగనే హరి కాళి దానిని గైకొని చివరవఱకు జాగ్రత్తగఁ జదివి తలయూఁపి, "సరిగనే ఉన్న" దని నభిప్రాయ మొసఁగెను. అమాయకుఁడైన హరికి నోరుఁ డేమియు పలుకక, అట్టులే చతికిల పడి యుండెను. పదం పడి కాళీదేవి, పత్రమ్మును గైకొని లలిత పడియున్న యొడ కరిగి "పిల్లదానా! ఈ బిళ్లపై సంతకము చేయుము" అని యామె నుద్దేశించి పలికెను.

పత్రమును గైకొని, కాళీముఖమును తేఱిచూచి "ఎందులకు పిన్నీ!" అని లలిత అనెను.

"పిల్లదానా! నేను చెప్పినట్లు చేయుము."

"పిన్నీ! సంతక మేల చేయవలెనో చెప్పరాదా?"

మొగము చిట్లించుకొని, ఎట్లో కిన్క నడఁచుకొని, హరికాళి యిట్లనెను. ఇంత విమర్శన ఎందులకు? ఈ పాట్లన్నియు నీ కొఱకే! ఎందుకు చెప్పుచున్నానో గ్రహింపలేక, చొప్ప దంటు ప్రశ్నలడిగన వేల? ఇందుండి వెడలిపోయి, ఎక్కడ ఎట్లుందువో మీ మంతగా పాటింపము.—నీ వెట్లు ప్రవర్తించినను, మేము నీ జోక్యము కలుగఁ జేసికొనము. నీ బ్రతుకు నీ వెట్లు చూచుకొన్నప్పటికి, మా యింటఁ బడినందువలన నీ కేమైన కొంత ముట్టచెప్పుట మా విధి ఎక్కడ ఉన్నను నెలకొక్కంటికి నీ కై దేసి రూపాయలు పంపుచుందుము. తెలివి తేటలు కల పిల్లదానవయిన మొదల, కూటి

పడ్డల కెట్టి యిబ్బంది కలుగఁ జేసికొనక యిదువూపాయలతో హాయిగా కాలము గడుపఁ జాలుదువు.—నీ కిది తక్కువఉప కారము కాదు.''

ఉపకారము తక్కువో, ఎక్కువో లలిత ఎఱుఁగును. అంతి యేగాక ఈ హితకాంక్షిణి హృదయమధ్యమున ఎంతహితము ప్రచ్ఛన్నమై యున్నదో కూడ నామె ఎఱుఁగును. విను వీధి నంటు దివ్యహర్మ్యశ్రేణి ముందుకూలి నదీగర్భమునఁ బడినపుడు, ఒకటి రెండిటుకల కొఱకును ఒకపోవు వెదురుబద్దల కొఱకు ఆ మేడ యజమాని భార్యమ తల్లితో జగడమాడునా? బంగారు వంటి తన సంసారము,—సంసారముతోఁ దన యైహిక సుఖమంతయు, గంగఁ గలియు తఱి కొలఁది మాత్రపు భత్య దెబ్బల కొఱకై, ఇంటఁదిని ఇపుడింటి వాసములు లెక్కించు మహాసీయగుణగరిష్ఠయైన మహిళతో నా యభాగిని పోరు సలుపునా? మాటేమియుఁ బలుకక లలిత హారికాళిని జేఱి చూచెను. ఆ తీక్ష్ణదృష్టికి హారికాళి అజస్రము భయపడుట కలదు. లలిత వంకఁ జూడఁజాలక, తల వంచుకొని ఆమె “సంతకము చేయుట కింత సందియమేల?'' అనియెను.

“ఇఁక సంశయమెందులకు?'' అని లలిత కలము చేబూని స్పష్టవర్ణములతో సంతకము చేసెను.

నేడాశ్వయుజ శుద్ధవిదియ—లలిత వెడలిపోవలసిన దినము. ప్రాతఃకాలమున [illegible] భవృష్టిగ వర్షము కురియుచున్నది. ఇంటికోడలు నేఁ డెల్లుప[illegible] పోఁజాల దేమోయని హారికాళి

కడుంగడు చింతిత యాయెను.

ఉదయమున లేచినవెంటనే ఇంటియందలి వస్తువుల నన్నింటిని లలిత జాగ్రత్తపెట్టం దొడంగెను. విలువైన వస్తువులను పెట్టెయందుంచి భద్రముగ బీగము వైచెను. అలంకారము లన్నిటిని ఇనుపపేటికయందు భద్ర మొనరించెను.

ఇంటి పనులన్నియు నెఱవేఱునరికి సాయంకాల సమాసన్న మాయెను. ఇంక ఆలస్యమేలయని లలితను దొందరపెట్టుచును, గూడవచ్చు మనిషికై హాకీకాళి తొందరపెట్టెను. కాలు గాలిన పిల్లివలె చంద్రనాథుం డిటునటు తిరుగసాగెను. పడక టింట కొరగిలపడి, చిరపరిచితమైన నాయింటిని దాను సజీవనై మఱొకవనిత కర్పించవలసి వచ్చె గదా దైవమాయని లలిత వెక్కివెక్కి ఏడ్వదొడగెను. పాపమాయనకు బ్రదుకు నిముసములో అధోగతి పాలాయెను. కన్యయుం గాక, పత్నియుం గాక వితంతువుగాక, కలుషభూయిష్ఠమైన ప్రపంచమున నామె ఏదిక్కులేక అల్లాడుచుండ వలెను. ఇల్లు వీడవలసిన వేళ సమీపించుకొలది ఆమె హృదయతాప మధికము కాం జొచ్చెను. ఒసంగంబడిన ఏడుదినముల గడువు నిముసములో గడచిపోయెను. దినముకంటె దిన మధికతర పీడన మొసంగి ఆమెను వెఱ్ఱి పిచ్చిచేసెను. కడపటినాడు తాను పూర్తిగ ధైర్యమును గోల్పోయిన యెడల, గుమ్మమునుండి కసరి గొట్టంబడు భిక్షుకురాలివలె కావలసివచ్చునని హృదయమున నతిప్రయాసతో వదిలపఱచు కొనుచుండెను.

ఇంతలో చంద్రనాథుఁ డాయింటిలోఁ బ్రవేశించెను.—తొట్రుపాటున లేచి లలిత కన్నులు తుడుచుకొనుచు, గద్గద కంఠయై "సంతు! నన్నీయింటినుండి తఱిమివేయుట కేల కాఁబోలు" అనుచు బాష్పలోచన యయ్యెను. చంద్రనాథుఁడు మఱొకవంకకుఁ దిరిగి కూర్చుండెను. అర్ధాంగి అతని దాపుఁ జేరి "ఇదిగో బీగము—మగల పెండ్లిచేసికొను వఱకు దీని నన్యులచేతఁ బెట్టకుఁడు" అనియెను.

"ఏమూలనో—ఒకమూల—పాఱవేయుము" అని చంద్రనాథుఁడు డగ్గుత్తికతోఁ బలికెను.

కోమల కరపల్లవములచే నిశేఖునిమోము అల్లనఁ దనవంకకు ద్రిప్పుకొని, చిఱునవ్వుతో "దుఃఖింప యత్నించుచున్నారా!" అనియెను.

చంద్రనాథుని మనసున నొక కత్తితో త్రివలెఁ దోఁచెను. తోడనే అర్ధాంగి అనురాగ పూగస్వరమున ప్రియుని కన్నీరుఁ దుడిచి "ఎన్నఁడైన మీతో పరిహాసమాడి యెఱుఁగుదునా! నేను విడిచి పోవుచున్న దినముగనుక పోక ముక్కాకనూఁ పరిహాసము పలికితిని—కోపగించుకొనకుఁడు" అని వినీత స్వరమునఁ బలికెను.

తలవాంచుకొని చంద్రనాథుఁ డప్పుడే యూరకొని యుండెను.

లలిత—వస్తువులన్నిటిని జాగ్రతగ పెట్టియుంచుదును, అలమార లందున పెట్టి తాళములు వైచితిని—పోరక నేవస్తువును పాడు

డెను.—ఇంటఁ బనిచేయు ముదుసలియొకతె రెండుమూఁడు సంచులు మూటఁ గట్టుకొని బండివానిపొంతఁ గూర్చుండి యుండెను. ఆనాఁటి సీతాదేవి విషయము వృద్ధునకు జ్ఞప్తికి వచ్చి యుండును. అందుచే అతనికి కన్నీరు ప్రబలవేగమున ప్రవహింపఁ దొడగెను.

పోవునపుడు లలిత, ఎదుట నిలిచి చూచుచున్న హరికాళి మనోభావమును గ్రహించి, పెట్టెనామె మ్రోలనిడి ప్రణమిల్లి ఆపవిత్రాంగన పాదధూళిని నొదలఁ దాల్చి "చిన్నా! పెట్టె నొకమాఱు చూడుము" అనియెను. అప్రతిభయై హరికాళి "అక్కఱలేదు. ఎందుకు?—అక్కఱలేదు,—" అనుచు చివాలున రేకుపెట్టెను దెఱచి చూచెను. లోపల ఒకటిరెండు ముతుకబట్టలును, ఒకటిరెండు పాటల పుస్తకములును, కాగితములందు జుట్టఁబడియున్న చంద్రనాథుని ఛాయాప్రతిమలును, ఒకలక్ష్మీవ్రతమును, ఒకకుంకుమ భరణియు మాత్రము చూపట్టెను.

"చిన్నా! వీనిని మాత్రము తీసికొంటిని" అని లలిత పలికెను.

హరికాళి మెల్లగ లోనికరిగెను.

సంధ్య ఆసన్నమగుచుండెను. ఇఁక పయనమునకు వ్యవధి లేదు. లలిత ఇఁక కదలి పోవలెను. నిముసమైన నాయింటఁ ఉడయరాదు. పవిత్రమైన సంఘము పాడువడిపోవును. గుండియ లవియ, అడుగులు తడబడ, కంటికి మంటికి నేకధారగా అశ్రువర్షము గురిపించుచు, కడసారి చూపులను వ్యాపరచే

తునిపై సారింప ఆతురమున గుమ్మముచెంత గొండొకవడి అల్లాడి విఫలమనోరథమై, పొంగి పొరలివచ్చు దుఃఖమును గమకష్టమున దిగమ్రింగుచు, వతమ స్తకయై లలిత అల్లనఁ బోయి బండియందుఁ కూర్చుండెను. బండి రొండయుఁడుఁక తడయక శకటముఁ దోలెను. ఎద్దు పరువపరువునఁ బోవుచుండెను. కాని బండి కిటికీనుండి లలితదృక్కులు చంద్రనాథుని యింటిదెస పర్విడెను. వంపుదిరిగి శకట మాదృగ్గోలమును దాఁటిపోయెను! దీర్ఘనిశ్వాసమొకటి లలితనోటినుండి వెల్వడెను! నిముసములో నాయభాగిని శకటమందు మూర్ఛిల్లెను! మేడ గొందవయంతస్థునుండి కిటికీ తెఱచి మణిశంకరుఁడు శకటమును విలోకించెను. "అయ్యో! మంచిపని జరుగలేదని" ఇవు డాకస్మికముగ నాతఁ డనుకొనెను. బండి యదృశ్యమాయెను.

౧౧

రాత్రి ఒక నిముసమైన మణిశంకరునకు నిద్ర పట్టలేదు. నిశీథమందలియు శకట నినాద మాతని చెవులఁ బడుచు, వాని యంతరంగమును గలఁచివైచెను. ప్రత్యూషమందే శయనమందిరమువీడి అతఁడవ్వలి కరిగెను. వీధి గుమ్మము చెంత ఎవరో యొక యపరిచితుఁడు మలినాంబర ధారియై జోగుచుండెను.

మణిశేఖరుఁడు తలయూచి "మంచిది—లోపలికి రమ్ము" అనెను.

ఇరువురొక గదిలోఁ బ్రవేశించిరి. తలుపు మూసివైచి మణిశేఖరుఁడు "అట్లైన అంతయు నిజమేనా" అనియడిగెను.

"అంతయు నిజమే" అని యావ్యక్తి రొంటినుండి ఒక కాగితముల కట్టను వెలుపలికిఁ దీసి మణిశేఖరుని చేతికిచ్చెను. శేఖరుఁడంతలో పత్రములన్నిటిని ఆమూలాగ్రము చదివి "అట్లైన పిల్లదాని దోషమేమి?" అని యడిగెను.

"ఆమె యందు దోషము లేదనుట సత్యమే; కాని తల్లి దోషమువలన తనయకూడ దోషియగునా?"

"తల్లి తప్పునకై ఒక నిరపరాధిని నిట్లు పీడించుటుచితమా?"

"ఏమి చేయుదును?—ప్రైకముకొఱకై ఎంతటి కార్యమునకైన నొడిగట్టవలెను."

ఇంతసేపు యోచించి మణిశేఖరుఁడు "అయ్యా! ఈ పాడుపేరు వెల్లడి యైనచో నేను కూడ నలుగురిలోఁ దల యెత్తుకొని మసలఁ జాలను. చంద్రనాథుఁడు నా అన్నకొడుకు" అనెను.

ఉత్తమాంగము పంకించి రమాకాంతుఁడు "ఇఁక వేఱు విధమేమియులేదు; నాకు సొమ్ము ముట్టి తీరవలెను." అని నొక్కి వక్కాణించెను.

"ప్రైకమును పడయవలెనని కంకణముఁ గట్టుకొని వచ్చి

నట్లు నీముఖారవిందమును విలోకించినంతనే బోధపడుచున్నది. నీకు వలసిన విత్తమును నేనే యిచ్చినచో నీవు సంతృప్తుఁడ వగుదువా?"

"నిజముగ సంతృప్తుఁడ వగుదును. నాకంతకంటె నేమికావలయును? ఇఁక కష్టపడి చంద్రనాథుని కలిసి కొనవలసిన అక్కఱ నాకుండదు."

"వైకము వడసి నీ వీయూరు విడిచి పోదువుగదా? మఱే కోరికయు కోరవుకదా? నిజము చెప్పుము."

"నిముసమైనను నిలువక వెడలి పోదును. మిమ్ము పీడింపను."

"నీ కెంత సొమ్ము కావలెను?"

"అధమ పక్షము రెండువేల రూకలు."

తోడనే మణిశంకరుఁడు దవ్వాలి కరిగి దస్తు- గుమస్తా లక్ష్మి నారాయణను బిలిచి, అతనితో నేమేమో చెప్పి, తదుపరి తాను లోని యాగారమున లోనికరిగి పెట్టె తెఱచి వేయి రూపాయల నోట్లు రెండుతీసి వానిని రమాకాంతుని చేతి కిచ్చి "మహాశయా! ఇచటికి పదిమైళ్ల దూరమున సర్కారు వారి ఖజానా యున్నది. ఈనోట్ల నచటికిఁ గొంపోయి మార్చుకొనుము.

మఱియిచటను పెద్దనోట్లకు నీకు సొమ్ము లభింపదు. నీవు మఱెన్నఁడు ఈమూలలకుఁ దొంగి చూడకుము. మరల నెన్నఁడైన నీవీదిక్కుగ నడుగిడితివేని ప్రాణములతో మరలఁ

జాలవని ఎఱుఁగుదును.— ఇది బాగుగ జ్ఞప్తి యందుంచుకొనుము" అనెను.

రమాకాంతుఁడు వెడలి పోయెను.

సూర్యాతపమునఁ గాళ్లు కాలుచున్నను, ఎండను తడయక అతి కష్టమున నాతఁడపరాహ్ణ మగుసరికి ఖజానా చేరుకొనెను. అప్పుడు కచేరి బంధింపఁబడి యుండెను. సెలవు దిన మగుటచే మన తెరువరి పని నెఱవేఱ లేదు.

మఱునాఁడు పదిగంట లప్పుడు రమాకాంతుఁడు ఖజానా కరిగి, వస్తు గుమాస్తా చేతికి నోట్ల నిచ్చి "రూకలు కావలె" ననెను.

గుమాస్తా నోటుల నటునిటు తిరుగవైచి పరీక్షించి "తాళుము" అని నిముసములో నొక రక్షకభట నాయకుని వెంటఁగొని వచ్చి, అతనికి రమాకాంతుని, జూపి "అయ్యా! ఈతఁ డీనోటులను దొంగిలించెను. నిన్నటి యుదయమున బిచ్చమెత్తు నెపమున నెవఁడో వచ్చి ఈ రెండునోట్ల నపహరించె నని జమీందారుఁడగు మణిశంకరుఁడుగారు నివేదిక పంపిరి.— నోట్లమీఁద నెంబరులు అతఁడు వచించినట్లు సరిగనున్నవి" అనియెను.

"నేను దొంగిలింప లేదు.—జమీందారుగారే ఈ నోట్ల నిచ్చిరి." అని రమాకాంతుఁడు దీనాననుఁడై పలికెను.

గుమాస్తా—మంచిది. అట్లని న్యాయస్థానమున చెప్పుకొనుము.

రమాకాంతుఁడు పోలీసువారి యధీనమై అచిరములో న్యాయస్థానమున బోనుయందుఁ బ్రవేశించెను. "మహా ప్రభూ! ఇది నేను దొంగిలించిన సొమ్ము కాదు. నాకు సైకము నతని పెద్దమనిషినే అడిగి చూడుఁడు." అని న్యాయమూర్తి మ్రోల అతఁడు పలికెను.

విచారణ సమయమున మణిశంకరుఁడు న్యాయస్థానమున కరుదెంచి "దేవుని యెదుట నిజమాడుదు" నని ప్రమాణ మొనరించి "ప్రభూ! ఈవ్యక్తిని నే నెన్నఁడుఁ జూచియుండ లేదు. నోట్లు నాపెట్టెయందే యుండెడివి. ఈతనికిఁ గాని మఱెవ్వరికిఁగాని నేను వాని నొసఁగలేదు." అని న్యాయ మూర్తి మ్రోల జంకక పలికెను.

రమాకాంతుఁడు తన నిర్దోషత్వము నిరూపించుకొనుటకై ఏమేమో చెప్పుకొనెను. అతని కెదురుగ పులివలె నిలిచి, మణిశంకరుని న్యాయవాదిబల్ల గ్రుద్దుచు, న్యాయస్థానము మారుమ్రోగునట్లు కేకలువైచుచు ముద్దాయిమాటలను కొన్ని తానే మ్రింగివైచి కొన్ని గాలిదుమారమునక్రింద నెగురఁ గొట్టి వానిని న్యాయమూర్తి కడకుఁ జేరనీయలేదు. 'ప్లీడరు పులి' పలుకులను పాటించి ముద్దాయి చెప్పినది పట్టి యబద్ధమని న్యాయమూర్తి నిమిషములో తీర్పు వ్రాసెను.—తీర్పు పిడుగువలె రమాకాంతుని తలపైఁ బడెను! పాపమతఁడు రెండేండ్లు కఠినశిక్ష ననుభవింప వలయును.

హారిదయాలుని గృహము శూన్యమై యుండెను. వెనుకటి పరిచారికలందఱు ఎవరిదారిని వారు పోయిరి. వంటచేయు విప్రాంగనజాడ మరలఁ దెలియలేదు. లలిత ప్రవేశించునప్పటి కిల్లంతయు భావురుమనుచు ఆమెకు భయంకరముగ మూప ట్టెను. కూడవచ్చిన ముదుసలి కన్నీరు నించుచు గద్గదస్వర మున "అమ్మా! నే నింక పోవుచుంటిని" అనియెను.

"నాయనా! నాకై చాల శ్రమపడితివి. నీకిచ్చుటకు నాకడ నేమియులేదు. ఈప్రణామమును మాత్రము గైకొనుము" అని లలిత ఆతనిముందు సాగిలపడియెను. ఆపెను లేవనెత్తి వెక్కి వెక్కి ఏడ్చుచు అతఁడందుండి నిష్క్రమించెను. హారి దయాలుఁడు వచ్చునందాక నైనను ఆతఁడందు తడయఁ జాలక పోయెను. తడయవలెనను వాంఛయైన వానికి లేక పోయెను.

సంధ్యాసమయమున దయాలుఁ డింటికి మరలివచ్చెను. వసారాయందు, దీనాననయై కూర్చుండియున్న లలితను విలో కించి అతఁడు "ఎవరు" అని పల్కరించెను.

లలిత అతని కెదురేగి వానిపాదముల కెరలి లేచి నిలువం బడి "నేనండి" అని నతముఖయై మెల్లగఁ బలికెను.

"ఎవరు!—లలితయా!—" అని హారిదయాలుఁ డాశ్చ

ర్యాన్వితుఁడై ఆమెను తేఱిచూచెను. ఆమెశరీరమున నొక యలంకారమైన లేకుండుటయు, కట్టుబట్ట కడుంగడు సామాన్యమైనదై యుండుటయు, కూడ దాసదాసీ లెవ్వరును లేకుండుటయు, అదూరమున నొక చీనా రేకు పేటిక పడియుండుటయు, గాంచి సంగతి యంతయుఁ గ్రహించి చిరునగవుతో హారిదయాళుఁడు "నే ననుకొన్నట్లే తప్పక జరిగినదే!— పాపము పిల్లదానిని తరిమివేసిరి కాఁబోలు!" అని యాతఁడు పరిహాసము చేసెను.

లలిత ఏమియు బలుకక నతముఖియై మిన్నకుండెను.

హారిదయాళుఁడు నిర్దయుఁడై ఆయువతి నుద్దేశించి కర్కశస్వరమున నిట్లనెను! "పిల్లదానా! ఇచట నిలుచుటకు నీకు నీడ లభింపదు. ఒకమాఱాశ్రయమిచ్చి, బుద్ధిఁ దెచ్చుకొంటిని ఆ యనుభవము చాలును!"

"అమ్మ ఎక్కడ?" అని లలిత నతముఖియై ప్రశ్నించెను.

"ఆయమ్మ కాలుకొలఁది పాఱిపోయినది. నన్ను నడిసముద్రమందు ముంచివైచి చల్లగ అవ్వలకుఁ దాటినది. నైజమెట్లో అట్లాచరించెను. పుట్టెను పుట్టినగుణము పుడకలతోఁగాని పోవునా?"

ఏమియు నుత్తరమొసగక, లలిత అట్లే నుత్తమాంగము వంచుకొని దీనాననయై నిలువంబడెను.

అధికాగ్రహముచే హారిదయాళుని ప్రత్యంగము దహించుకొని పోవుచుండెను; పరిహాసస్వరమున నెదుట నిలిచిన అనద

నుద్దేశించి అతఁడు "ఆమె ఎచటికేగెనో చెప్పఁజాలను; కాని ఎచటనున్నను ఆమె హాయిగనే యుండును" అనియెను.

ఇఁక నిలువఁజాలక లలిత నేలపైఁ జవాలున చతికిల పడియెను. అత్తింట నీడలేక, తల్లిచెంత లేక తనువు వెళ్లబుచ్చ వచ్చిన ఆమె మిగుల తత్తఱపడియెను; నిముసమైన నందు నిల్వవలదని కఠినాత్ముఁడైన దయాలుఁడామె నదలించుచుండెను.—పాప మప్పుడామె ఏమిచేయును?

ఖిన్నముఖియై చతికిలబడియున్న లలితను సంబోధించి హరిదయాలుఁడు మరల నిట్లనెను. "నాయింట నీకు నిలువ నీడయిచ్చి, కులము చెఱచుకొనఁ జాలను. అల్లారుముద్దుగ ఆదరించి నిన్ను గొనిపోయిన ఆ పెద్దమనిషి తల దాఁచుకొనుటకై నీకొక గుడిసెనైనను కట్టియీయఁజాలక పోయెనా! నీకొఱకిచట నేమైన దాఁచుకొని కూర్చుంటినని కాఁబోలుఁ నా నెత్తిమీఁద నెక్కి త్రొక్కుమని, అతఁడు నిన్నిచటి కంపెను! ఇఁక వెఱ్ఱివేషములు వేయక వెంటనే ఇందుండి కదలుము చెప్పుచున్నది నీకుఁగాని ఆ యెదుటి గోడకు కాదు!"

లలిత ఇఁక దుఃఖము నణంచుకొనఁజాలక పోయెను. వెక్కి వెక్కి ఏడ్చుచు దయాలుని కాళ్లపైఁబడి "తాతగారూ! అమ్మ లేదు. నే నెచ్చటికి పోదును!" అని గద్గదస్వరమున బలికెను.

ఏకోశమందైన హరిదయాలునకు రవంత జాలిలేదు. పదములపైఁ బడి విలపించుచున్న అభాగినిని దూరముగఁ దన్ని వైచి "కాశీపుణ్యక్షేత్రమున కాలు నిలుపుకొనుటకు నీకు

చోటు దొరకక పోదు. అవ్వలికరిగి ఎవ్వరినైన ఆశ్రయము నకై యాచింపుము" అని ఇంచుకంతైన మోమోటము లేక ఆబ్రాహ్మణోత్తముఁడు వాక్రుచ్చెను.

జీవితేశుఁడే ఇంటఁ దావలమొసఁగ నపు డన్యు డొసఁగు నని తలఁచుట పిచ్చితలంపనియు, అవ్వలి కరుగమని కసరి కొట్టు దయాలునందు దోసము లేశమైన లేదనియు లలిత గ్రహింపఁ గలిఁగెను. పాప మిపుడామె నిలుచుట కీవిశాల ప్రపంచమందు జానెడునేల లేదు. అతిథివలె మగనియింట నున్న దినములు నిముసములో నెగసి పోయెను.—ఆ యాదర మును అతిథిసత్కారమును అంతరించి పోయెను. ఆతిథ్యము పడసిన ఆయభాగిని ఎందరిగెనని ఆదరాయత్త చిత్తుఁడైన ఆగృహస్థుఁ డిఁక వెన్కకుఁ దిరిగి చూడఁడు. కడుంగడు కోమల మైన నామె యెడద దుస్సహ దుఃఖాగ్నికుండమై పోయెను. గంగాప్రవాహము ఆమె కన్నులనుండి అశ్రుధార లవిరళముగ గండభాగమునుండి ప్రవహించుచుండెను. ఆమె కింకను పదు నేడేండ్లు పూర్తిగ లేవు.—ఈప్రాయమందే ఆమె కన్నివాంఛ లును, సుఖములును గడచిపోయెను. ఇపుడు తల్లిలేదు. తండ్రి లేఁడు. కట్టుకొనిన పుణ్యాత్ముఁడు ఇంటినుండి వెడలఁ గొట్టి వైచెను. విశాల విశ్వవలయమున నెందును దలఁదాచు కొనుట కామెకు బెత్తెడు మేరలేదు. వంశకళంకమును, బిడియ మును, విపులసాపయానమములు మాత్ర మున్నవి! వీనితో యథేచ్ఛగ జీవన మతివాహన మొనరింపవచ్చునుగాని, లలిత

ప్రకృతి వేఱు! ఆమె పవిత్రహృదయమున నట్టి తలఁపు చేరఁ జాలదు!! ఆత్మహత్య అనుచితమని ఆయాడుది ఎఱుఁగును. కృశీభూతమగుచున్న నామె శరీరపంజరము నుండి ప్రాణములు తమంత తా నెగపిపోవు దనుక అవనిపై ఎట్లో ఆమె యల్లాడు చుండ వలెను. తన యాయువిఁక నిట్లెంత కాలము నిలుచును దైవమాయని ఆ యభాగిని వాపోవ దొడఁగెను. ఈభూతల నిరయమున నెంతకాలము మనవలసినను నేఁడు తన పునర్జన్మకు మొదటిదినమని ఆమె యోచింపవలసి వచ్చెను. శైశవ కాలమునఁ గడగండ్లకామె యపరిచిత కాకపోయినను, ఇట్టి తీవ్రావమానమును, సంఘదుష్పీడనమును నామె యెన్నఁడు ననుభవించి యుండలేదు.

లలిత తడసిన కొలఁది దయాలుని క్రోధ మంతకంత మధికము కాఁ జొచ్చెను. ఉత్తేజితమైన ఆతని కంఠస్వరము మఱింత తీవ్రమాయెను. చిందులుత్రొక్కుచు, ఉచ్చైస్స్వరమున నాక్రోశించుచు "కదల మెదలక ఱాయివలె ఇంకను అట్లే పడియుంటివేల చూడు మిపుడేమి చేయుదునో! తుచ్ఛురాలా! ఇది నీయబ్బ యిల్లను కొనుచున్నావా?" అనెను.

"స్వామీ! ఎచటికి పోదును?" అని యాకులభావమున లలిత ప్రశ్నించెను.

"నే నేమెఱుగుదును! ఇచ్చవచ్చిన చోటునకు పొమ్ము."

రుద్ధస్వరమున లలిత "తాతగారూ! ఈరాత్రిమాత్రము."

"ఛీ ఛీ నోరు మూయుము, ఒక్క నిముసమైన నీవిందు

నిలువరాదు. శీఘ్రముమే ఆవలకు పొమ్ము!"

నేలఁ గూలియున్న లలిత లేచి నిలువంబడెను. చకితచిత్త యయ్యు, ఈమాటతో నామె యించుక మనసు పదిల పఱచుకొని, యిట్లు తలపోయఁ దొడఁగెను. "వేయినేరము లొనరించినను, ఎవరి కాళ్ళపైఁ బడి పలుమాఱు బిక్ష వేఁడికొనుటకు నాకధికారము కలదో, అతని నే యట్లనురోధింపనగు) దన్యుని స్థలభిక్షకై ప్రార్థించు టేల?—ఏయండ లేనప్పుడేమి చేయుదును? ఆత్మహత్య యనుచితమని యెంతకాలము యోచింతును? ఏదిక్కు లేకున్నను, కాశీమహాక్షేత్రమున జాహ్నవి యున్నదికదా! అది యింకను శుష్కించి పోలేదు. మందాకినీమ తల్లి సంఘమునకు భీతిల్లినది కాదు. తనకులము చెడునని గాని మతము మాయునని గాని వెఱునదు. ఎందును నే నాశ్రయము పడయఁ జాలకపోయిన యెడల జాహ్నవీ జనని యీయక మానదు!"

ఇట్లని యోజించి లలిత మెల్లగ నిష్క్రమింప గమకించెను; కాని, ఆమె యడుగులు తడఁబడెను. తోడనే ఆతన్వి నేలపై చతికిలబడి పోయెను!

ఎంత గద్దించినను, ఆమె తనయిలువీడి వెడల కున్నందులకు హారిదయాలుఁడు నిప్పులు త్రొక్కిన కోతివలె చిందులు త్రొక్కసాగెను. లలిత గాలి సోకినంతనే తనసర్వము నష్టేటఁ గలియు ననియు, తోడనే ఆమె యవ్వలి కరుగకున్న, గడలేని ముప్పు దనకాపాదించుననియు, నాపాఱుఁడు యెంచింపఁ దొడఁగెను. అఱచిన కొలఁది అతని గొంతుకు బొంగురు

పోయెను. కోపము పట్టఁజాలక హుమ్మని ముందున కుఱికి చెప్పినకొలఁది తెగిసాగుచుంటివేల?—అవమాన పఱుపకున్న నిందుండి కదలవేమి? ఇంతవఱకు నీశరీరమును తాకలేదు. వెంటనే ఇందుండి అవ్వలికి నడువవేని ఒక్క గెంటున—”

అని హరిదయాలుఁ డఱచుచు కురంగశాబకముపై నుఱుకు కంఠీరవము కరణి లలితదెస లంఘింప గమకించుతఱి అవ్వలినుండి—

“బాబాజీ! ఆగు మాఁగుము” అను కేక వినఁబడెను.

హరిదయాలుఁడు తొట్రుపడి అట్టె నిలువంబడి అవ్వలికిఁ జూచెను.

తోడనే ఈశ్వరదాసొక చేతఁ జతురంగపాళీయు, రెండవ కరమున హుక్కా గొట్టమును బూని లోపలఁ బ్రవేశించెను. ఆతఁడచటి కరుదెంచి చాలసేపాయెను. అవ్వల నిలిచి అతఁడు హరిదయాలుని కఠినోక్తులను వినుచుండెను. లలిత కవమాన మాపాదించునని యడలి, అతఁడు చివాలున లోపలఁ ప్రవేశించెను. కరములందు హుక్కా చతురంగపాళీలున్నను ఎప్పటియట్లు అతని యాననమున నగవు తోపలేదు. తిన్నగ లలిత దాపున కరిగి ఆదరపురస్సరముగ “అమ్మా! ఎప్పుడు వచ్చితివి?” అని యాతఁడడిగెను.

లలిత ఈశ్వరదాసును బాగుగ నెఱుఁగును—పల్కరింపఁగనే ఆమె వానికి ప్రణమిల్లెను.

“సౌభాగ్యవతీభవ!” అని యాశీర్వదించి “అమ్మా!

రమ్మన్న నీ బిడ్డ యింటికిరాక, ఇచ్చట ఎందులకు తల్లీ!" అని వాలుకుర్చీ క్రిందఁ బడవైచి, లలిత రేకు పెట్టెను చంకఁబెట్టు కొని "అమ్మా! నడువుము. సంధ్య దాటుచున్నది." అని పల్కెను.

ఆమెను గొంపోవుటకే వచ్చినట్లు మిగులఁ జనువుగ నాతఁడు ప్రసంగించెను.

లలిత మనసంతయు ఆకులాయుత్తమై యుండెను. దాను ఆదరోక్తులామెకు బాగుగ బోధపడలేదు. అధోముఖియై ఆమె యట్టులే కూర్చుండెను.

అందుండి కదలి పోవఁ దొందర పడుచు ఈశ్వర దాసిట్లనెను? "నీ ముసలి బిడ్డ యింటికి వచ్చుటకు బిడియమేల తల్లీ! అందెవరును కఠినోక్తులచే నీ మనసు నొప్పించి, నిన్నవమానపఱుపరు. తల్లీ కొమరుల మిరువురము కలిసి కొంపయందు క్రొత్త యేర్పాటు చేసికొని, ఆనందముగ కాలము పుచ్చుదము. అమ్మా! నడువుము. ఆలసింపకుము."

లలిత అప్పుడుకూడ లేచి నిలువంబడ జాలకపోయెను.

ఆఁబోతువలె ఒక అంకెవైచి, "ముదుసలీ! ఏమి నీసాహసము" అని గంభీరస్వరమున హారిదయాలుఁడు పలికెను.

"బాబాజీ! సాహసమేమీలేదు" అని లలితను సమీపించి, ఆదరపూర్వకముగ నామె చేయి పట్టుకొన నుంకించి, "అమ్మా! నడువుము. ఇందుండి ఊరక కఠినోక్తులేల వినుచుందువు" అని ఈశ్వరదాసు నితాంత కాతర భావమునఁ

బలికెను.

లలిత లేచి నిలువంబడెను ;—అది గాంచి హరిదయాలుండు “దాదాజీ! ఈ మెను నీ యింటికిఁ దీసికొని పోవుచుంటివా యేమి ?” అని దాసును ప్రశ్నించెను.

“లేదు బాబూ! నడివీథిలో కూర్చుండఁబెట్టుటకై కొని పోవుచుంటిని” అని ముసలి జవాబొసంగెను.

వృద్ధుని వ్యంగోక్తి విని, హరిదయాలుండప్రతిభుఁడై “దాదాజీ!—నీవు మిగుల తొందరపడి పోవుచున్నావు!—తేపు నీ పని ఏ మగునో కొంచె మాలోచించుకొనుము” అనియెను.

ఈశ్వరదాసేమియు నుత్తర మొసఁగక, లలిత నుద్దేశించి “అమ్మా! త్వరగా నడువుము. లేకున్న మరల నీ పెద్దమనిషి ఏమైన ననివైచును!

లలిత మెల్లగ గుమ్మము దాఁటి అవ్వలి కరిగెను. పేటికను బుజమున నిడికొని ఈశ్వరదాసు అల్లన నామె వెన్నంటి చనెను.

“దాదాజీ! తుదకు జాతి వదలు కొందువా ఏమి ?” అని దయాలుఁడు వెనుకనుండి కేకవైచెను.

దాసు వెనుకకు మరలక “బాబాజీ! నీవు తీసికొనుచో, అట్లనే వదలు కొందును” అని జవాబొసంగెను.

అట్లయిన మా యింట నెన్నఁడు విస్తరి వేయుటకు నీ వర్హుఁడవు కావు సుమీ!”

ఈ మాటు వెనుకకు తిరిగి నిలువంబడి "మహాశయా! ఈశ్వరదాసెన్నఁడైనఁ నెవరి యింటనైన విస్తరి వేసిఎఱుఁగునా!"

ఎఱుఁగక పోవచ్చును——కాని నీ బాగునుగోరి చెప్పవలసిన దానిని చెప్పివైచితిని——నీ వైనను, నలువురిలో తలయెత్తుకొని తిరుగవలసిన వాఁడవు కదా! జాగ్రత!"

ఈశ్వరదాసు కనుబొమలు ముడివడియెను. కాశీపురమందాతఁడున్న నీ దీర్ఘకాలమున నిప్పుడే ఆతఁడించుక కిన్కఁ జూపెను. "హరిదయాలూ! యాత్రికుల నోట బెడ్డఁగొట్టి, ముమ్మాఱు మొక్క పలుగులను భోక్తలఁజేసి, అనవరతము, మరణములను అపేక్షించి పిండముల నడుమ దొరలుటకు నేను శ్రాద్ధముల శాస్త్రినిగాను! నాకు నీవు భయము చూపుచుంటివేల? మంచిదని తోఁచిన దానిని కావించుట నా చిరయభ్యాసము——నేఁడుకూడ ఆ యలవాటు ననుసరించి యాచరించుచుంటిని. అందులకై నీ వంతగా తత్తఱపడవలసిన యవసరములేదు." అని యాతఁడు నొక్కి చెప్పెను.

హరి దయాలుఁడు తెల్లవోయి, "నీమేలు నభిలషించియే."

"బాబాజీ! ఇఁక చాలించుము. నీ సలహా ననుసరించి, ఈ యేఁబది వత్సరములు గడుపఁగలిఁగినపుడు, శేషించిన రెండుమూఁడేండ్లను నీ యాలోచనముఁగైకొనక గడపఁజాలనని నే నడలను, బాబాజీ! ఇఁక విశేషముగ బోధింపక లోపలికరుగుము."

ఒడలు మండుచుండ హరిదయాలుఁడు వెనుకకుఁ దరలెను

ఇల్లుచేరి, పెట్టెక్రిందకు దింపి "అమ్మా! ఈ యిల్లునీది— ఇందలి వస్తువులన్నియు నీవియే! నేను నీ బిడ్డను, ఈ వృద్ధు నొకకంటఁజూచుచు నీ యిల్లు నీవు చక్కఁ బెట్టుకొనుము.— తల్లీ! ఇంతకంటె నధికముగ నేమి చెప్పుదును!" అని యూద రానురాగములు తేటపడ దాసు పలికెను. తులసికా యనన్య ఆశ్రయముఁ బడయఁజాలెను.

## ౧౩

రాత్రియంతయు మేల్కొని యుండి, శరత్కాలప్రాతః సమీరణుఁడు, స్నిగ్ధమధురస్వనమున అల్లన నిజాగారముఁ బ్రవేశించుతఱి గుండెలపై జేయివైచుకొని నిద్రామగ్నుఁడగును. తదుపరి వాతాయన మార్గమునుండి ప్రభాకర మయూఖములు అల్లన లోపల ప్రవేశించి, ఆతని ముఖమున నృత్యమొనరించినంతనే ఆతనికి మెలకువ కలుఁగును. నిద్దురమత్తు కనుఱెప్పల నప్పుడింకను పీడకున్నను, బలవంతముగ పర్యంకమును వదలి ఆతఁ డవ్వలి కరుగుచుండును.—దినమంతయు నేపనియు ముట్టక, నెవ్వరితోడను ప్రసంగింపక విషణ్ణ వదనుఁడై వెఱ్ఱివానివలె నతఁడు మసలుచుండును. సుఖవాంఛలనతఁడు పూర్తిగ వదలుకొనెను. ఈ విధముగ చంద్రనాథుని దినములు కడుంగడు భారములై జీవన ఝురీగర్భమున రేఁబవలు

దుఃఖమారుత వీచికలయం, దుష్టూఁత లూఁగుచుఁ గడచిపోవు చుండెను. దిగంత ప్రసారితకాల మేఘము జీవనమధ్యాహ్న మందే తన సుఖద్యుమణి నాచ్ఛాదిత మొనరించినట్లు గ్రహించి, యాకాశము మొయిలుల మఱుంగునందే హఠాత్తుగ నా దినమణి అస్తమిల్లి పోవునని ఆతఁడు యోజింపఁ దొడఁగెను. ఈ నిరాశా తమసమే క్రమ క్రమముగ ఘనతరమగుండఁ జంద్రనాథుఁడనిమీలితనేత్రుఁడై నిజాగారమున నొక్కరుఁడుప విష్టుఁ డగుచు, దన దినములు గడుపఁదొడఁగెను.

ఏ కాంతమునఁ జంద్రనాథుఁడు పిచ్చివానివలె నట్లు పడి యుండు తఱి అపుడపుడు హరకాళి ఆతనిఁ జేరఁ జని "నాయనా! ఇట్లొంటరి బ్రదుకు కెన్నాళ్లని యోర్వఁ జాలుదువు. కావలసిన సంబంధ మొకటి యున్నది.— ఈ ఆశ్వయుజము గడువకుండనే ముడివైచికొని నాయనా ఒక యింటివాఁడవు కమ్మి!" అను చుండెడిది. చంద్రనాథుఁడు తలయెత్తక, ఏమియుఁ బలుకక మిన్నకుండుటఁ గాంచి, ఆతని నీరవము సమ్మతి సూచకమో, లేక అసమ్మతి లక్షణమో యెఱుఁగ నా యిల్లాలు పతితో తర్కవితర్కములు సలుపుచుండెడిది. వివాదమువలనఁ బ్రయోజనము కానుపింపని తఱి మణిశంకరుని పాలికరిగి చంద్రనాథుని యభిప్రాయ మేమై యుండునని యడుగుచుండెడిది. "అతని నడుగకుండ నేమియుఁ జెప్పఁ జాల" మని మణిశంకరుఁడు వ్రాయుచు చుండును.

దసరా యుత్సవములు సమీపించు చుండెను. మణిశంక

రుని పూజామందిరము నుండి సనాయిపాట ప్రభాతవాతూల మునఁ గలిసి పురమునఁ బర్వులిడుచు పూజాగమన సువార్తను పౌరులకుఁ దెలుపుచుండెను. నిదురనుండి మేలుకాంచి యట్లే నిమీలితనేత్రుఁడై పానుపున పన్నుండి, చంద్రనాథుఁడా స్వర మును విన్దొడఁగెను. వినుచుండగనే "ఇఁక సీ తావున నుండ రాదను తలఁపు అకస్మాత్తుగ నతని మనసునఁ దట్టెను. తోడనే పరిచారకుని బిలిచి "సామానులను గట్టి యుంచుము. నేఁడు ప్రయాగ పోదును" అని చంద్రనాథుఁ డనెను.

ఆ మాట విని ఎందుండియో హరకాళి పర్వెత్తుకొని వచ్చెను. వ్రజకిశోరుఁ డరుదెంచి నీతిప్రబోధము సలుపసాగెను. చెప్పనేల మణిశంకరుఁడు కూడ విచ్చేసి, "నేఁడు షష్ఠి— ప్రయాణతిథి కాదు. ఇలువీడి ఎచటికిని అరుగరాదు." అని చంద్రనాథునితో నొక్కి చెప్పెను.

చంద్రనాథుఁ డెవరి యుద్బోధనమునకుఁ జెవియొగ్గ లేదు.

చంద్రనాథుని ప్రయాణవార్త విని, అపరాహ్ణ సమయ మున హరిబాల యరుదెంచెను. లలిత వెడలిపోయిన తరువాత. చంద్రనాథుని గృహమును నామె మరలఁ ద్రొక్కి చూడ లేదు

చాలదినములైన పిదపఁ ఆమె యరుదెంచుటఁ గాంచి "అవ్వా! దారి తప్పి వచ్చితివా? అని చంద్రనాథుఁ డడిగెను.

అవ్వ (అందుల కుత్తర మొసఁగక)—నేఁడు ఊరికి పోవు చుంటివా?

"అవును."

"త్రివేణీ తీర్థమునకా ? "

"అవును."

ఇంచుక నేపేమో యోచించి "నాయనా! నువెచ్చటి కైనఁ బోఁదలఁచుచుంటివా ? " అని అవ్వయనెను.

హరి యభిప్రాయమును గ్రహించి "మరెచటికినిఁ బోఁ దలఁచుట లే"దని నిమునములో చంద్రనాథుఁడు చింతా మగ్నుఁడాయెను.

ఏమి చెప్పఁ దలఁచి యరుదెంచెనో, దానిని ప్రకాశమొన రించుటకు అవ్వ మిగుల బిడియపడసాగెను.—ఏమి యుచ్చ రించుటకు ఆమెకు నోరాడుటలేదు. చాలనేపు మిన్నకొని యుండి, యెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని "నాయనా! దాని కేదైన ఒక ఉపాయము చూపితివి కావు కదా !" అని యామె యనెను. ఒకరి నొకరు కలిసికొని నప్పటినుండి, లలితవిష యమే వారి చిత్తములందుఁ, దొలుకులాడుచుండెను.—అందు చే నీ సామాన్య విషయోల్లేఖన మాత్రముననే యిరువురి కన్నులును అశ్రుపూరితములాయెను. దుఃఖావేగము నణఁచు కొని మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొని, చంద్రనాథుఁడు "అవ్వా! ఏమి ఉపాయము చూపుదును ? " అనియెను.

"కాశీలో ఆమె ఎవరి యొద్దనున్నది ? "

"తల్లి దగ్గతే ఉన్నదను కొందును."

"కాని—"

అవ్వ వంకఁ దిరిగి " 'కాని' యనుచుంటివేల ? " అని

యడిగెను. .

ఇంచుక సేపూరకొనియుండి, మెల్లనినిస్స్వరమున "నాయనా! ఏమియు అనుకొనకుము—" అని ఏమియో చెప్పఁ బోయి, అవ్వ మరల యిన్నకుండెను.

ఆమెను దేఱిచూచుచు జంద్రనాథుఁ డట్లే కూర్చుండి యుండెను.

అవ్వ యప్పుడు మెల్లన నిట్లు బ్రతిమాలఁ దొడఁగెను. "నాయనా! చేతిలో నేమైన పెట్టిరమ్ము—నేఁడు ఒంటిఁగనే యున్నది, కాని రెండురోజులుగడచిన పిదప—"

అవ్వ మాట నంతగా గ్రహింపఁజాలక, చంద్రనాథుఁడు "రెండురోజులైన పిదప నేమి?" అని యడిగెను.

చేలాంచలిచేఁ గన్నీరు దుడుచుకొనుచు "నాయనా! కన్న తల్లి పుట్టిడు నీకు వోసికొని యున్నదికదా!— దైవము రక్షించి తల్లియు బిడ్డయు—" అని అవ్వ ఏమో చెప్పఁబోవు చుండ ఆమెకంఠము రుద్ధమై పోయెను.

వృద్ధురాలి మాటలు వినినంతనే చంద్రనాథుని ఆ పాద మస్తకము కంపించి పోయెను—" అవ్వా! నేఁడు షష్ఠికాఁ బోలు!" అని తత్తఱపాటున నాతఁడనెను.

"అవును నాయనా"

"అట్లైన నేఁడు—"

"పయన మాపఁ దలఁచితివా?"

"అవును—అట్లే యోచించుచుంటిని"

“పూజాయుత్సవములు ముగిసిన పిదప, ఇష్టమువచ్చిన తావునకు బొమ్ము— ఈ నాలుగు దినములు నాయనా! యిల్లుకదలి అవ్వలి కరుగకుము.”

ఏమి యోచించుకొనియెనో గాని చంద్రనాథుఁ డందుల కియ్యకొనెను.

దసరా గడచిన పిదప చంద్రనాథుఁ డొకనాడు వృద్ధపరిచారకునిఁ బిలిచి “అబ్బి! కాశీలో ఆమెను వదలివైచి వచ్చినపుడు హరిదయాలుఁడు నీతో నేమైన చెప్పియుండెనా?” అని వాని నడిగెను.

“నా కాతఁ డగపడనే లేదు”

భీతివ్యంజకస్వరమున, చంద్రనాథుఁడు “అగుపడనే లేదా? అట్లైన ఆమె నెవరికడ దిగవిడిచి వచ్చితివి?— ఆమెతల్లి నైనఁ జూచి యుంటివా?”

“అయ్యా! చూడలేదు. ఆయింటియందు నాకెవరును కానుపింప లేదు.”

“ఏమి! ఎవ్వరుఁ గానుపింపనే లేదా?—ఆయింట నెవరైన వసించుచుండిరో లేదో కనుఁగొని యుంటివా? ఒకవేళ హరిదయాలుఁడు బస మార్చివైచెనేమో!”

“ఆవిషయము వాకపు చేసితిని,—దయాలుఁడు ఆయింటిలోనే వసించుచుండెను. వేఱుతావునకు పోయి యుండలేదు.”

నిట్టూర్పువిడిచి క్షణకాల మూరకొనియుండి “గుమాస్తానిటు పిల్వుము” అని చంద్రనాథుఁ డనెను.

పరిచారకుఁడు పోయి యాతనిఁ గొనివచ్చెను.

"అయ్యా! ఇంతవఱకు కాశీ ఎంతపైకము నంపియుంటిరి?" అని నాయుద్యోగి నాతఁ డడిగెను.

"స్వామీ! నే నేమియు పంపియుండ లేదు."

"ఏమియు పంపియుండ లేదా?"

విస్మయావేశ నోత్కంఠములచేఁ జంద్రనాథుని వదనము పాంశువర్ణమై పోయెను.

ఉద్యోగి నిర్వ్యారపాటున నిలువంబడి యుండెను.

"ఏల పంపితివి కావు?"

బిడియముచేఁ దల యెత్తఁజాలక "ఐదురూపాయలు చొప్పున పంపిన చాలునని మీ మేనమామగా రనిరి" అని గుమాస్తా పలికెను.

జవాబువిని, చంద్రనాథుఁ డాగ్రహావేశుఁడై పోయెను.

"ఐదురూపాయలు చొప్పున పంపుమనెనా! ఏమి! ఈ సొమ్మంతయు మేనమామగారిదా యేమి!—ప్రతిమాసము ఆమెకు ఏఁబది రూకలచొప్పున పంపుచుండుఁడు."

"చిత్త"మని స్తంభితుఁడై గుమాస్తా మెల్లగ నందుండి నిష్క్రమించెను.

ఈ విషయము చెవిని బడినంతనే, ఏలనో హరికాళి యుల్లాస మత్యధికమై పోయెను! లోననుండియే ఉద్యోగి నుద్దేశించి చేసన్న యొనర్చి, కడుపుబ్బ నవ్వసాగెను. ఆయుల్లాసినవ్వున కర్థము గ్రహింపజాలక అతండు తనదారిని పోఁ

దొడఁగెను. మృదుస్వరమున నాతని వెన్కకుఁ బిలిచి హార కాళి "నాయనా! అతఁడు మతిమాలిన వానివలె మసలు చున్నాఁడు—ఎంతసొమ్ము పంపమని చెప్పెను" అనియెను.

"ప్రతిమాసము ఏఁబది రూపాయలు పంపుమని అతఁడు ముదల యొసఁగెను" అని యుద్యోగి నిర్మ్కమింపఁ బోయెను.

అదివిని యామె మరల నిద్రూపహాస మొనర్చెను. అది విని యుద్యోగి ఇంచుక విరక్తిజెంది ఆనగవెందులకో యోచించుచు నిలువంబడి పోయెను. అపుడు జవనిక మఱుఁగునుండి ఆమె యిట్లనెను. "ఆహా! బిడ్డకు కోపమువచ్చిన యెడల, వెనుకముందు లెఱుఁగడు,—ఆ పాపిష్ఠురాలి పాపము బ్రద్దలైనదని, దుఃఖము పట్టఁజాలక నెలకై దేసి రూపాయలు పంపుట మంచిదంటిని. అదివిని క్రిందుమీదు లెఱుఁగక చిందులు త్రొక్కుచున్నాఁడు. ఒక్క పైసయైనను ఆపిల్లదాని కడ కంపరాదని ఆతని యభిప్రాయము!"

చంద్రనాథుని యుద్దేశమది కాదని, యుద్యోగి ప్రథమమున నూహించెను; కాని, యోచించిన కొలఁది హారకాళి వచించినది నిజమే యై యుండునని అతఁడు గ్రహించెను. కట్టుకొనిన పడంతిని, నిష్ఠురుఁడై నిలయమునుండి నిర్వాసన మొనరించిన వ్యక్తి, అంతమొత్తము నాయభాగిని కడకంప నేల వాంఛించునని ఆతఁ డనుకొనెను. అందుచే "అమ్మా! మీరనుకొనినది నిజమే యై యుండు"నని అతఁడు హారకాళి నుద్దేశించి పలికెను.

"ఈ మాత్రము ముందుగనే యూహింపఁ జాలక పోతివి ఏమని చెప్పుదును?"

ఉద్యోగి అప్రతిభుఁడై "అవును మొదట నే నట్లని గ్రహింపఁజాలక పోతిని" అనెను.

"పోనిండు——కాని ఐదేసి రూపాయలు చొప్పున పాపమామెకు పంపుచుండుడు.——చంద్రనాథుఁ డీయకున్న యెడల నాపైకమునుండి నేనే యిచ్చెదను"

మాసమునకు ఏఁబదిరూపాయల చొప్పున చంద్రనాథుఁడు వారకాళికి స్వాంతకర్చులకై యిచ్చుచుండును.

"మంచి దట్లనే పంపుచుండు" నని పలికి, యుద్యోగి అవ్వలి కరిగెను.

కతిపయదినములు గడచిన పిదప చంద్రనాథుఁడు ప్రయాగ కరిగెను. లలితకు పైకముఁ బంపుటయందు అతని యుద్దేశమేమో ఉత్తరము మూలమున నరయవలెనని యుద్యోగి యూహించెనుకాని, ఆవిధమున తనబుద్ధిసూక్ష్మత ప్రకాశమొనరించుకొనుట యగునేమో యని అతఁడు మిన్నకొనెను.

రెండేండ్లు గడచిపోయెను. తక్కుంగల విషయము లెట్లున్నను, ఈవత్సరమున నీశ్వరదాసు చిత్తము విశేషముగ పరివర్తన మాయెను. ఏనాఁ డాతని యనుంగుబిడ్డ లకాలమృత్యువాతఁ బడిరో, ఆనాఁడు విపుల విశ్వవలయ మంతయు ఆతని కన్నుల నుండి దురీకృతమై పోయెను—ఇత్తఱి లలిత శిశువు ఆతని నా విస్మృత ప్రపంచమందలి ప్రణయమయ జటిలమార్గములకు మరల్చివైచెను. బహుదినానంతరమున నేఁ డాతని కన్నులందు భాష్పశైవలిని వెల్లివిరిసెను. నయనములు దుడిచికొని వృద్ధుఁడు, "మాయింట విశ్వేశ్వరుఁ డవతరించెను" అనియెను.

విశ్వేశ్వరుఁ డప్పుఁ డింకను పసివాఁడు. "విశూ" అని పిలిచినప్పు డుత్తర మొసఁగఁజాలక పోవుచుండును. ఊరక జూచుచుండును. జనని క్రోడతలమందుఁగాని పరిచారిక పజ్జఁగాని తన చిన్న పఱుపునందుఁగాని బుద్ధిమంతునివలె పన్నుండి యుండును. కాని క్రమముగ కొంతకాలమున కా శిశువు జనని యంకతలమును పూర్తిగ వదలివైచి, క్రొత్త ఈశ్వరదాసు క్రోడసీమయందు, దృఢముగ స్థాన మేర్పఱుచుకొనెను. రేపకడ మేలుకాంచి దాసు "విశూ!" అని పిలిచినంతనే, తన చిన్ని మోమెత్తి 'దాదా!' అని యాతఁడు జవాబొసఁగును. "విశూ! శంభు తాతపై ఒక ఆట కట్టు

దుము" అని దాసు పలుకఁగనే అతఁడు చతురంగబలమును చేఁబూని "రా! దాదా!!" అని తన బాహువుల రెంటిని ప్రసారిత మొనరించి, చివాలున వృద్ధుని గళమునఁ వానిచేఁ బెనవైచును. అపుడు దాసు ఆనందమునకు మేరలేక పోవు చుండెడిది.—తోడనే లలితను బిలిచి, "అమ్మా! నీబిడ్డ గొప్ప ఆటగాఁడగును సుమా" అని వచించుచుండును. మందస్మిత వదనయై, అప్పుడా తొయ్యలి తనయు నొకమాఱెత్తి, కౌఁగ లించుకొని ముద్దాడును. తోడనే బాలకుఁడు తల్లి యాలింగన మునుండి విడివడి, చతురంగబలమును జేఁబూని, వృద్ధుని చంకఁబడి, ఆటకై అవ్వలి కరుగుచుండును.—మార్గమునఁ బోవుచుండ నెవ్వరైన "తాతా! ముసలితనమున మఱి రెండు చేతులు మొలచినవా" యని పరిహాసించి నపుడు, ఒకమాఱు పక్కున నవ్వి దాసు, "నాయనా! ఈ ముసలిచేతులం దింక బలములేదు.—ఎండిపోయెను ; అందుచే సంసారవృక్షమునుండి చివాలున పడకుండుటకై, దయాళుఁడైన భగవంతుఁడు నాకీ క్రొత్త చిఱుచేతులను ప్రసాదించెను" అని యుత్తర మొసఁగు చుండువారు.

"మాటలం దీతాత నోడింపఁజాల" మని వార లపుడు తరలి పోవుచుండువారు.

శంభునాథుని యింట జరుగు చదరంగమున శ్రీమాన్ విశ్వేశ్వరునకుఁ గూడ నొక స్థాన మనవరతము నిరిష్టమై యుండును. తాతగారి జానువుపై దృఢస్థాన మేర్పఱచుకొని

ఆతని వలువయుంచు నూతఁగ బట్టికొని గంభీరవదనుఁడై ముందునకు వంగి, అవసరమైనయెడల, దాను కూడ ఒకటి రెం డెత్తులు వేయుటకు సంసిద్ధుఁడై యున్నట్లు తదేక దీక్షతో బాలకుఁ డాటను పరీక్షించుచుండును.

ఆటబలములు ఒకదాని వెంబడి నొకటిగ పితామహుని చేతులందు నిహితమై యుండుటచే, అతిశయోత్సాహమున విశ్వేశ్వరుఁ డిరుచేతుల వానిని గైకొని, అవి పాఱిపోవునేమో భయమున తన చిన్ని బొజ్జపై వాని నణఁచి పట్టుకొని యుం డును. ఎట్టిరంగు మంత్రిపై ఆతని కనురాగ మధికము, అది చేతి కంది యంతదనుక బాలుఁడు తనలో లుపన్యాసములను దానిపై సారించుచుండును. అప్పుడప్పుడు తత్తఱపాటున నతఁడు "దాదా! అదిగో! చంపి తియ్యి!" అని పితామహుని బురి కొలుపుచుండును. ఆటయందు మగ్నుఁడై దాసు, "ఉండు దాదా!" అనుచుండును. మంత్రి యింకను దన చేతులఁ బడ లేదని బాలుఁడు వృద్ధుని యంకతలమునఁ దొట్రుపా టొం దుచు ఆగ్రహమున నవ్వాలి కరిగి చిందులు త్రొక్కుచుండును. దాసు మన సప్పుడు చంచలమగుచు ఒకమాఱు బాలకుని దెసకును మఱొకమాఱు ఆటవంకకును దిరుగుచుండును. ఆ తత్తఱపాటున నేదేని యొక జంతువు మరణ మొందుచుండ దాసు వెన్కకుఁ దిరిగి "దాదా! ఓడిపోతిని!—రా! రావాలి" అని బాలకుని పిలుచును. విశ్వేశ్వరుఁడు పర్వుపర్వున వచ్చి, తన పూర్వస్థానమున పీఠము వైచుకొని యుపవిష్టుఁ డగును!—

తోడ్తోడనే ద్విగుణీకృతోత్సాహముతో మరల నా ముదుసలి కడు నేర్పు చూపి ఎదుటివాని జంతువుల పరిమార్చుచుండును. విశూమాత్ర ఆట ముగియఁగనే ఎక్కమంత్రిని జేఁ బూని, ఇంతింతనరాని సంతసమున నుప్పొంగుచు పితామహుని భుజ మెక్కి తల్లినిఁ జేరుచుండును.

ఈ తీఱున నీశ్వరదాసు క్రొత్త విధముగ దినములు నడువ సాగెను. క్రమక్రమముగ నాతని దినచర్యయందు మార్పు చూపట్టెను. మునిపటివలె కేఁబపలులు చదరంగ మాతని దృష్టి నాకర్షించుటలేదు. ఒక్కొకప్పుడది యింట నేమూలనో పడియుండును. శంభునాథుని నిలయమునకు ప్రభాతసమయ మందాతఁడు తఱచుగఁ బోవుట మానివై చెను. అపరాహ్ణ సమయమున గంగారామునితో ఆతఁడాడుట మానివై చెను. సంధ్యానంతరమున ముకుందుని కచేరి చావడి యందిఁక వెను కటివలె చతురంగమునకై ఎవరును జేరువారు కారు. ముకుం దుఁడసందెంచి కవాటము పొంత గొంతుక చించుకొనుచు ఎంత యఱచినను ముదుసలి యువ్వలి కసుదెంచువాఁడు కాఁడు. అత్తఱి ప్రదీప సమీపమున నుపవిష్టుఁడై నూతన శిష్యునకు ఆట నేర్పుచుండును.

„విశూ! గుఱ్ఱము ఎదుట ఘుడి మూలకు దాఁటును."

గంభీరవదనుఁడై విశు „గుఱ్ఱము—"

„అవును గుఱ్ఱము—"

„గుఱ్ఱము దాటేసుందా? మఱి—

"అవును. గుఱ్ఱము ఎదుటనుండి మూలకు దాఁటును."

మనసున నూతన భావోదయ మగుటచే, బాలకుఁడు "గుఱ్ఱము బండి మూలఁగా లాగుతుందా——"

తనయుని నుడువులు విని లలిత ముదమందుచుండును. కాని ఈశ్వరదాసు హతాశుఁడై "కాదు దాదా! ఈగుఱ్ఱము బండి లాగదు. ఆగుఱ్ఱము వేఱు" అని ప్రతివాదము సలుపుచుండును.

"మఱి ఈ గుఱ్ఱము మాత్రం ఎందుకు లాగదు బండిని——"

వాదమున తాతను పడఁగొట్టవలెనని చూచు తనయుని బుద్ధి కుశలతఁ గాంచి, ముఖమున కడ్డముగ చేలాంచలి వైచుకొని పక్కున తల్లి నవ్వుచు అవ్వలి కరుగుచుండును.

ఇంచుకంతైన విసుఁగుఁజెందక వృద్ధుఁడు మిగుల నోపికతో శిష్యున కాటఁ గఱపుచుండును.

తన చిరుచేతిని ఇటు నటు త్రిప్పుచు, పెదవి విఱచుచు, తల పంకించుచు బాలకుఁడు "అదిఏది?" అని కూని రాగము దీయును. ఎఱ్ఱరంగు మంత్రికై అతఁడు విలపించుచుండెనని వృద్ధుఁడు గ్రహించువాఁడు. అన్ని జంతువులుండ, నెఱ్ఱరంగు మంత్రిపై బుడుతని దృష్టి ఏల యధికమాయెనో పితామహుఁ డూహింపఁ జాలకుండెను.

బాలకుఁడు కోరిన దానిని తక్షణమే యిచ్చి తీఱవలెను. బుడుతని ప్రార్థనము త్రోసి పుచ్చుట యసంభవము. చతురంగసేనయందలి ఒకటి రెండు వేఱు జంతువులను బాలునిఁ

జేతఁ బెట్టి ఆతని మఱపింప ముదుసలి యత్నించుచుండువాఁడు. కాని విశు సాధారణుఁడు కాఁడు—ఇంచుకెంతైన మఱచువాఁడు కాఁడు. అప్పుడింక వేఱు వెరవు లేనందున వృద్ధుఁడు బాలుని చిన్ని యఱచేతియందు ప్రార్థితవస్తువు నుంచి „దాదా! పాఱవేసెదవుసుమీ! జాగ్రత్తగా దాచుకొనుము. ఏమి? తెలిసినదా?" అని వృద్ధుఁడు ముద్దు ముద్దుగాఁ బలుకును.

"దాదా! పారేస్తే ఏం?"

"దాదా! మంత్రిపోయిన ఆట సాగునా?"

"ఎందుకు సాగదూ!!"

"దాదా! సాగదు!!"

విశు—(గంభీరవదనుఁడై)—దాదూ! మంతిడీ, మఱీ—

"మంతిడి కాదు దాదూ—మంత్రి!"

ఆనాఁడు రామశాస్త్రిగారింటిలో పురాణకాలక్షేపము జరుగును. "విశూ! పురాణము వినబోవుదము. దబ్బున రావలెను దాదా!" అని బాలకుని ఈశ్వరదాసు పిలిచెను.

విశ్వేశ్వరుఁ డపుడు పట్టులాగు తొడుగుకొని, ముఖమల్ అంగీ వేసికొని తల్లిచే చక్కఁగ తల దువ్వించుకొని, ముఖమున చిన్ని చేర్చుక్కఁ బెట్టించుకొని, చిన్ని జోడు తొడుగుకొని, ఎప్పటియట్లు పితామహుని వాహనముఁ గావించుకొని, పురాణము వినుటకై వెడలెను. శాస్త్రీజీ భరతరాజు ఉపాఖ్యానము చెప్పుచుండెను. శ్రావ్యముగ పాడుచు, భావాను

సారము అభినయించుచు అతఁడు శ్రోతల కమితానందము గొలుపుచుండెను.

"ఇట్లా మహాపురుషుఁడు వనమందు వసించుచుండ హరిణ శిశువొకటి ఆతని పాలికి పర్వెత్తుకొనివచ్చి, 'హే! రాజా! ఆశ్రయభిక్ష ఒసఁగుము' అని కాతరకంఠమై, అశ్రుజలపూరిత లోచనమై వేఁడి నంతనే, కరుణాళుఁడై యామహాపురుషోత్తముఁడు నిరాశ్రయమైన నామృగశాబకమున కాశ్రయ మొసఁగిన వాఁ డాయెను!" అని శాస్త్రీజీ వచింప, తాను వినినదంతయు జనని కెఱిగింపఁ దలచి బుడుతఁడు తదేకధ్యానముతో వినఁ దొడఁగెను. శాస్త్రీజీ చెప్పినదంతయుఁ దనకుఁ దెలిసినట్లుగ నెంచుచుఁ బితామహుని క్రోడతలమున గూర్చుండి అపు డపుఁ డత డుల్లాసమున చప్పటులు కొట్టుచుండును. బాల శ్రోత యభిలాషకుఁ గడు నలరి పరమపరితోష సంభరిత స్వాంతుఁడై, వృద్ధుఁ డాతని ఎత్తి ముద్దాడుచు మరల నంక తలమునఁ జేర్చుకొనుచుండును.

"అట్లా కురంగ డింభకము ఆమహాపురుషుని ఆశ్రయము పడసి నిమిషమాత్రపు కాలమైన ఆతని విడచి యుండక రేఁ బవలు లాతని యంకతలమునందే వసించుచు క్రమ క్రమముగ ప్రణయరజ్జువుఁ బేనివైచి, ఆయనురాగ శృంఖలముచే ధవుని గట్టివైచి, జప తపములందును, స్నాన సంధ్యాదులందును, పూజా—పురస్కారములందును చెప్పనేల నిత్యకర్మలన్నిఁటి యందును నాయొడయనితోఁ బాల్గొను చుండెడిది! ధ్యాన

మగ్నుఁడై యున్నతఱి, మృగశాబకము సజలకరుణ దృష్టులఁ దనపై సారించుచుంట నాతఁడు మనశ్చక్షు సమక్షమున వీక్షించుచుండు వాఁడు, క్రమక్రమముగ నాహారణ డింభకము పెద్దదియై, కుటీరము వీడి, ప్రాంగణమందును, ప్రాంగణము వదలి పుష్పవనమందును, తదుపరి అరణ్యమందును, పదంపడి దూరస్థ వన్యపథములందును బర్వులెత్తుచు, సంతసమున గంతులిడఁ దొడఁగెను. మృగశిశువు మరలివచ్చు సమయము గడచిన యెడల, భరతరాజు మిగుల నుత్కంఠితుఁడై యుచ్చైస్స్వరమున "వాణీ! వాణీ! రమ్మా! రమ్మా! అని పిలచును," అని శాస్త్రీజీ భరతుని యార్తక్రోశము రాగాలాపనచేసి యనంతరము మరల నిట్లు పురాణము చెప్పఁ దొడఁగెను" ఇట్లుండ నొకనాఁడా యిఱ్ఱిపిల్ల తన, యనురాగబంధనముఁ బుటుక్కునఁ ద్రుంచివైచి, వన్యపథమున నదృశ్యమై పోయెను. మానవుని మనోవ్యథ గ్రహింపజాలక వన్యపశువు వనమున కరిగెను. వృద్ధుఁడైన భరతుఁడు "వాణీ! వాణీ! ఇంటికిరమ్మా! యింటికిరమ్మా! అని బిగ్గఱగఁ బిలుచుచుండువాఁడు. కాని, ఆ దీనారవము గహనవాతూలమున నెందేని ఎగసిపోయెడిది. వాని వాణి మరలిరాలేదు. అతని యఱపుల కెవ్వరు నుత్తర మొసఁగలేదు. అప్పుడు నిజకుటీరముపీడి, అరణ్యమంతయు నన్వేషించి, గిరికందరము లన్నిఁటిని కలయవెతకి, వృక్షతలములఁ బరీక్షించి, వాణీ! వాణీ! యని వాపోవుచుఁ దిరిగెను. కాని 'వాణి' కాన్పించలేదు. దినము, రెండుదినములు,

మూఁడుదినములు గడచిపోయెను.—అప్పుడైన నాతని పెంపుడుబిడ్డ మరలి రాలేదు. దుస్సహాచింతచే వృద్ధుఁ డాహార మంటఁ జాలకపోయెను.—గభీర నిశీథినీ సమయమందైన కన్నులు మూయనేరకపోయెను.—స్నానసంధ్యాదులు గతించెను. దేవపూజ కట్టువడియెను. పురాణపఠనము అంతరించిపోయెను. ఛిన్నవిచ్ఛిన్నమైన ముదుసలి యెడద మరల నతుకుకొనలేదు. శిథిలహృదయుఁడైన వృద్ధుఁడు నేలఁగూలెను తోడ్తోడనే భయంకరమృత్యుదంతములు భూలుంఠితుఁడైన భరతుని బట్టివైచెను. వాణీ! రమ్మా! వాణీ! వాణీ! అని మరల అతని యంతరంగము వాపోయెను. కాని ఆ దీనారవము శ్రుతిగోచరము కాలేదు. కేవలము వృద్ధుని తృషితయోష్ఠాధరములు ఒకమాఱు కంపించెను.—పిదప నంతయు అంతమాయెను. ఇట్టికోఁ అక్కై వృద్ధుని ప్రాణవాయువు వన్యవాతూలమున నెగసిపోయెను. హా భరతా! భరతా!!" అని శాస్త్రీజీ ముఖారి ఆలాపించెను.

కొంతసేపటికి ఈశ్వరదాసు కన్నులు దుడిచికొని, బాలకు నెత్తుకొని, "దాదా! ఇఁక యింటికిపోదము రమ్మా. చాల రాత్రియైనది" అనెను.

"అమ్మ దగ్గఱకా" అని బాలకుఁడు పితామహుని బుజ మెక్కెను., ఒక్క తావునందే చాలసేపు కూర్చుని యున్నందున వెంటనే అతనికి నిద్దుర పట్టెను.

ఇలుసేరి లలితకు, తనయు నప్పగించి వృద్ధుఁడు "ఇడిగో!

అమ్మా ! నీ వస్తువును నీ వద్దనే ఉంచుకొమ్ము." అనెను. అప్పుడు వృద్ధుని కన్నులు రెండును అశ్రుపూరితములై ఎఱ్ఱ వడి యుండెను.

## ౧౫

ఈ రెండేండ్లనుండి చంద్రనాథున కింటితో సంబంధమేమియు లేదు. పైకము కావలసినప్పు డతఁడు తన యధీనోద్యోగులకు వ్రాసి తెప్పించుకొనుచుండువాఁడు.

అధికముగ సంగలార్చుచు, నింటికి రమ్మని వేఁడుచు చంద్ర నాథున కప్పుడప్పుడు హారికాళి ఉత్తరములు వ్రాయుచుం డెడిది. మరలి రమ్మని కోరుచు వ్రజకిశోరుఁడు కూడ వ్రాయు చుండువాడు, ‹నాయనా ! నేను పెద్దవాఁడనైతిని. క్రమక్రమ ముగ నా దేహము క్షీణించుచున్నది. ఒక్కమాఱు నిన్ను చూడవలెనని వాంఛించుచుంటిని. వెంటనే తిరిగి రమ్ము" అని ఒకటి రెండు మాఱులు మణిశంకరుఁడు కూడ లిఖించి యుండెను.

కాని, చంద్రనాథుఁ డెవ్వరి వేఁడికోలును పాటింపలేదు. ఇట్లుండ నొకనాఁడు లలిత వృద్ధసఖియొద్ద నుండి కూడ ఒక జాబు వచ్చెను. "నాయనా ! నీతో చెప్పవలసిన సంగతులు కొన్ని కలవు. వీలు చూచుకొని, ఒక మాఱింటికి రాఁ గోరు

చుంటిని" అని యవ్వాలిఖించెను.

హరిబాల తన సతి కంతరంగ సఖియని చంద్రనాథుఁ డెఱుఁగును. ఆమెను గుఱించిన యుదంతమేమైనఁ దెలుపు నేమో యనియు, ఆమె యనురాగపు జాబును దనకా యవ్వ నూపఁజాలునేమో యన్నియు, ఆమె ముద్దు చేవ్రాతనేమైనఁ జూపునేమో యనియు, దమ విగతసుఖకాంతి యించుక ప్రియురాలి పత్రమునఁ జూపట్ట వచ్చుననియు, ఆశపడి, అతఁ డీక తడయక పయనమాయెను. కాని, కొండంత యాసతో నిలుచేరిన చంద్రనాథున కాశాభంగ మాయెను. నూతన విషయమేమియు హరిబాల తెలుపలేదు. అతఁడూరక మార్గా యాసము పడవలసి వచ్చెను. నిరుత్సాహమున నిట్టూర్పు నిగిడించు జంద్రనాథు నుద్దేశించి" ,,ఎంతకాలము విరాగివై అన్యస్థానమున కాలము గడపెదవు? జరుగవలసినదేమో జరి గిపోయెను.—ఇఁకనైన గతమును మఱచి ఒక యింటివాఁ డవు కమ్ము! పక్షివలె నీ విట్లొంటిగ బడియుండుట మేము చూచి సహింపఁజాలము" అని హరిబాల పలికెను.

చంద్రనాథుఁడు వృద్ధపలుకులను లక్ష్యపెట్టక తన దారిని దాను పోయెను.

కాని, మణిశంకరుఁ డాతని వీడక చేయిఁబట్టుకొని "నా యనా! నా మాట వినుము. ఆ నాఁటనుండి నా హృదయ మెట్లు జ్వలించుచున్నదో కేవలము అంతర్యామి ఎఱుఁగును" అని డగ్గుత్తికతో పలికెను.

చంద్రనాథుఁడు నతమస్తకుఁడై, మిన్నకొనియుండెను.

"నాయనా! మరల పరిణయ మాచరించుకొని సంసార ధర్మమును పాలన మొనరింపుము. నీ మనసునకు నచ్చు పిల్ల దాని నొకర్తుకను వెతకియుంచితిని, నీ యభిప్రాయమెఱుఁగుటకై, యింకను తాంబూలములను గైకొనక ఊరకొని యుంటిని. తండ్రీ! ఒక యిల్లాలు గతించినపుడు లోకులు మఱొక యిల్లాలిని జూచుకొనరా?"

"ఒక యిల్లాలు గతించిన వార్త తెలిసినయెడల, అట్లే చూచుకొందును." అని విరక్తిభావమున చంద్రనాథుఁడనెను.

"రామ! రామ! నాయనా! ఇటువంటి మాటలను నోట రానీయకుము."

చంద్రనాథుఁడు మిన్నకొని యుండెను.

మణిశంకరుఁడు—నాయనా! దీని కంతటికిని నేనే కారణము! నా మూలముననే మీ సతీపతుల కిట్లొరకు ఎడబాటు వచ్చెను. నేనే బంగారువంటి మీ సంసారమునకు చిచ్చు ముట్టించితిని—ఆ మరణము నా హృదయమున నీ తలంపు వేధించుచుండును.

చంద్రనాథుఁడు చాలసేపు చింతామగ్నుఁడై యుండి, "సంబంధ మెచట స్థిరపఱచితిరి?" అని పినతండ్రి నడిగెను.

"కలకత్తాలో స్థిరపఱచితిని.—నీవొకమాఱు పోయి, పిల్లను చూచి, వచ్చుట మేలు."

"అట్లైన రేపే పోదును."

తనయు నాశీర్వదించి మణిశంకరుఁ డిట్లనెను. "నాయనా! శుభము. పిల్లదానిని చూచి, నీమనసున నచ్చి నప్పైన వెంటనే జాబు వ్రాయుము. అందినంతనే మీపిన్ని, మొదలగు వారిని దోడ్కొని నేను కలకత్తా వచ్చి చేరుకొందును. (ఇంచుక నేపు తడసి)——నాయనా! క్రమక్రమముగ నా దార్ఢ్యము సన్నగిలుచున్నది.——ఇఁక నేను బ్రదుకునది మాత్ర మెన్నినాళ్లు? నీవు మరల ఒకయింటివాఁడ వగుట చూచి సంతసించి ఏ చింతలేక ప్రాణములను బాయఁగలను."

మఱునాఁడు చంద్రనాథుఁడు కలకత్తా చనెను. కూడ, మేనమామ పోయెను. పిల్లను చూచి వ్రజకిశోరుఁడు "నాయనా! పిల్ల సాక్షాత్తు లక్ష్మీదేవి వలె నున్నది.——ఆలసింపక తాంబూలములు పుచ్చుకొనుట మంచిది" అనెను.

పెడమొగము వెట్టికొని, చంద్రనాథుఁ డేయభిప్రాయముఁ దెలుపక యిన్నకొనెను.

స్టేషనున కరిగి,టిక్కట్లుకొని, యిరువురు రైలులోఁ గూరుచుండిరి. "నాయనా చిన్నది నీ మనసునకు నచ్చినదా?" అని మేనమామ చంద్రనాథు నడిగెను.

చంద్రనాథుఁడు (నతమస్తకుఁడై)——నచ్చలేదు. వ్రజకిశోరుఁడు (నిర్ఘాంతపడిపోయి)——అటువంటి బంగారు బొమ్మ నచ్చలేదా!

"లేదు!"

నిర్దిష్టమైన స్టేషన్‌లో బండి నిలువఁగనే వ్రజకిశోరుఁడు

దిగెను. చంద్రనాథుఁడు ప్రయాగకు టిక్కెట్టుఁ దీసికొనెను.

"నాయనా! ఇంటికి ఎన్నిదినములలో మరలి వత్తువు?" మేనమామ దిగులుతోఁ చంద్రనాథు నడిగెను.

"ఇంతలో మరలి రావలెనని లేదు.—చిన నాన్నగారికి నాప్రణామములు తెలుపవేఁడెదఁ."

మణిశంకరుఁడు వ్రజకిశోరుకు చెప్పిన యూనుడువు విని, హా తాశుఁడై యిట్లనెను: "జరుగఁదలచినది జరుగును.—నాకు కొంచెము ఆరోగ్యము కలిఁగినంతనే స్వయముగా కాశీపోయి కోడలినిదీసికొనివత్తును. ఊరక సంఘమునకు వెఱచి చిరకాలము నరకకుండమునఁ బడి మ్రగ్గఁజాలను. 'సంఘము, సంఘ' మని అడరుచుంటిని! సంఘము ఎవ్వారి మెవరు?—నేనే కాదా?"

మణిశంకరుని యభిప్రాయ మెఱిఁగి, పండ్లు పటపటఁగొఱుకుచు హరకాళి "అంత్యకాలమున ముసలి సయ్యామునకు గంగ వెఱ్ఱి నెత్తుచున్నవి!" అని భీషణాకారయై, కోశీ యుద్యోగి కడకరిగి "ఏమోయీ! చంద్రనాథుఁడు క్రొత్తసంబంధము మాట నీతో నేమైన చెప్పెనా?" అని యడిగెను.

"అమ్మా! నూతనసంబంధమును గుఱించి, అతఁడు నన్నేమియు అడుగలేదు.—కాని, నేఁటి వఱకు కాశీ ఎంత మొత్తము పంపితివని నన్నాతఁ డడిగెను."

"కొండంత! ఊరంత! అని చెప్పకపోతివా?—నిక్షేపము వంటి పిల్ల నచ్చలేదఁట. ఆకోతి మొగమునకు!—"

అని చిందులు ద్రొక్కుచు హారకాళి పొరుగింటి మహిళా రంగమున కరిగెను.

## ౧౬

చంద్రనాథుఁడు ప్రయాగకు టిక్కట్టుఁ దీసికొనెను. కాని మార్గమధ్యమున సంకల్పము మార్చుకొని కాశీస్టేషనులో దిగిపోయెను. కూడ నున్న పరిచారకులు బండి యొకటి కుదిర్చి సామానందు చేర్చిరి. చంద్రనాథుఁడు శకటమునఁ గూర్చుండక, స్టేషనుయొద్దనున్న బంగాళాలో వేచియుండుఁడని భృత్యులకు ముందల యొసఁగి తాను వేఱుమార్గము బట్టి పోయెను. కొంత దూరము సాగినంతనే ఆతనికి గమనాయాసము కలిఁగెను! ముఖము శుష్కించి వివర్ణమైపోయెను. ఒక్కొక్క యడుగు ఆతని యెడదపై తీవ్రాఘాతముకై వడి దగులసాగెను. అయినను, నిముసమైనను నిలువఁజాలక అతఁడు ముందునకు నడువఁ దొడఁగెను. క్రమక్రమముగ హారిదయాలుని యిల్లు సమీపించెను. కాశీపథము లాతని కపరిచితములుకావు. అతఁడు నడచు వీధి మూలయందలి మిఠాయి యంగడి మునుపటివలెనే యుండెను. దుకాణదారుని రూపురేఖలందుఁ గూడ నెట్టి మార్పు కనుపింపలేదు. నిప్పు సెగ నుండి బూంది దూయుచుండుటచే, పిల్లకొండవలె నున్న

అతని యొడలినుండి సెలయేళ్ళవలె ఘర్మోదకము స్రవించు చుండెను. చంద్రనాథుఁడు విపణి కెదురుగ నిలువంబడెను. నానాపాత్రనుండి మరలి అంగడివాని దృక్కులొకమాఱు చంద్రనాథునిపైఁబడెను. కాని దొరవేషమున నున్న వానిని మిఠాయి కొనుఁడని వేఁడుట కాతనికి సాహసము కలుఁగ లేదు.—అందుచే మరల వాని దెసఁ జూడక అతఁడు తన పనిఁ దాను చూచుకొనఁ దొడఁగెను.

చంద్రనాథుఁడు మఱికొన్ని యడుగులు ముందునకు వైచెను. కాని గళ్లీమూలనుండి ఆతని కాలుముందుకు సాగినది కాదు. సంకీర్ణమైన ఆపథము చాల యుక్కగనుండెను. రెండడుగులు ముందుకు వైచి, ఒకమాఱు నిలిచి, మరల నడచి, యీవిధముగ నాతని యడుగులు తొట్రుపడసాగెను. తుదకెట్లో చంద్రనాథుఁడు హరిదయాలుని గృహ సమ్ముఖమున నిలువంబడెను.—ఎంతసేపు నిలచినను, ఆతని హృదయమున దడ తగ్గలేదు. గుమ్మమునుండి కేక వేయవలెనని ఆతఁడు యత్నించెను, కాని నోటినుండి మాట రాకుండెను. జేబులోని గడియారము తీసిచూచెను.—తొమ్మిదిగంటలు దాటెను. అప్పుడెట్లో ధైర్యముఁ దెచ్చుకొని "దయాలుఁడు—గారూ! దయాలుఁడుగారూ!!" అని చంద్రనాథుఁడు కేక వేయగలిగెను. ఎవ్వరును ఉత్తరమొసఁగలేదు. పథమునుండి నడచువారలు చంద్రనాథుని వేషము నించుక వెనుకకుఁ దరలి చూడఁదొడఁగిరి. "దయాలుఁడు—గారూ! దయా

లుఁడు—గారూ!!" అని చంద్రనాథుఁడు మరల పిలచెను.

ఈ పర్యాయము లోపలినుండి యాఁడుది యెవ్వరో "ఇంటిలో లేరు" అని జవాబొసఁగెను.

ఉత్తర మొసఁగినది ఒకవంగదేశీయ పరిచారిక.

తలుపు వఱకు వచ్చి చంద్రనాథుని వేషము చూచి చివాలున నామె మఱుఁగున దాఁగెను. కాని పరిచితమైన భాషను విని ఆమె యడలి పరుగెత్తలేదు. లోపలినుండి "ఇంటిలో లేరండి" యని కేక వైచెను.

"ఎప్పుడు వత్తురు?"

"సాయంకాలము."

చంద్రనాథుఁడు లోపలఁ బ్రవేశించెను. ఆనందలజ్జాశంకలు గలిసి, ఆతని యెడదనుఁ గలచి వేయఁ దొడఁగెను. అర్ధాంగి మొగము నెట్లు విలోకింతునా యని ఆతఁడు తల్లడించుచుండెను. లోపల నడుగిడి అతఁడు నలువంకలు పరికించెను. ఎవ్వరును దృగ్గోచరము కాలేదు.

"ఇంటి యందెవరును లేరా?" యని యతఁడు దాసి నడిగెను.

గోడ వెనుక నిలిచి, దాసీ "లేరండి" అనెను.

"వార లేరి?"

"ఎవరండి?"

"ఒక ఆఁడుది,—"

"ఒక అఁడుదానను నేనే నండి!"

"ఇంక స్త్రీ లెవరు ఇచట లేరా ?"

"లేరండి. నేను మాత్రము ఉన్నానండి."

"ఒక చంటిబిడ్డ ఉండవలెను కదా ?"

"బాబయ్యా ! నాకంత అదృష్టము పట్ట లేదండి."

"నీసంతానము మాట నే నడుగుచుండుటలేదు.—ఈ యింటిలో ఒకచంటిబిడ్డ ఉండవలెను కదా."

"ఈ యింటిలో చంటిబిడ్డ ఎప్పుడును ఉండనే లేదండీ."

చంద్రనాథుఁడు చివాలున మేడమెట్లపై చతికిలపడిపోయి, "అట్లైన వీర లెచ్చటికి పోయిరి" అని యడిగెను.

చంద్రనాథుని పిచ్చి ధోరణికి దాసియించుక విసుఁగుఁ జెంది "అయ్యా ! ఇచట మఱెవరు లేరని చెప్పుచుండుట లేదా ?—నేనును దయాలుఁడుగారును తప్ప ఈయింటిలో ఇం కెవరును లేరు.—నెలదినములనుండి యాత్రీకులైనను గుమ్మము త్రొక్కిచూడలేదు" అనెను.

చంద్రనాథుఁడు నిర్ఘాంతపడిపోయెను. అతని నోటినుండి మాట వెలువడలేదు. ఆతని యంతరంగమున నత్తఱి ఎట్టి భీషణభావము లుత్పన్నమగుచుండెనో అంతర్యామి మాత్ర మెఱుఁగును. చాలసేపట్లే యూరకొనియుండి, అతఁడు "ఇచట నీవెంత కాలమునుండి పనిచేయుచున్నావు" అని దాసి నడిగెను.

"రమారమి సంవత్సరముమీఁద ఆఱునెలలైన దండి."

"ఇంతకాలమునుండి పనిచేయుచున్నను నీ వెవ్వరిని

ఈయింటఁ జూడనే లేదా? బంగారు వన్నెగల ఒకయువతిని, ఒకచంటిబిడ్డను లేకున్న యువతి నొక్కతెనో, నీవు పనిచేయుకాలములో చూచియుండలేదా?"

"లేదండి—నే నెవరిని చూడలేదు."

"వారిని గుఱించిన వృత్తాంతమేమిగాని వినియైన నుండ లేదా?"

"లేదండి."

చంద్రనాథుఁ డికేమియు నడుగలేదు.—మెట్లపై నట్లే చతికిలబడియుండి హారిదయాలుని రాకకై యతఁ డెదురు చూచుచుండెను. తనసహభాగిని, తన లలిత ఇఁక నిహాలోకమున లేదని యతఁడు స్పష్టముగ గ్రహించెను. అయినను కబురు విని పోవలెనను ఉద్దేశముతో నతఁడు తడసెను. తడసి నంత సేపు ఒక్కొక్క నిముస మొక్కొక్క యుగముగ నాతనికిఁ దోఁచుచుండెను.

రెండు జాములు తిరిగిన పిదప హారిదయాలుఁ డింటికి వచ్చెను. మోకాళ్లపై మోమిడి ఖిన్నుఁడై మెట్లపైఁ గూర్చునియున్న యాగంతువునిఁ జూచి యతఁడు చకితుఁడై పోయెను. పదంపడి యాతనిని గుఱుతించి హీనస్వరమున "ఓహో! చంద్రనాథుఁడుగారా! ఎప్పుడు వచ్చితిరి?" అని హారిదయాలుఁ డడిగెను.

అతికష్టమున దుఃఖధుని నరికట్టి, గద్గదస్వరమున చంద్రనాథుఁడు "చాల సేపై వచ్చితిని—వీర—లేరి?" అని

యడిగెను.

"వారా!—మఱి—వారు!—"

సంబంధరహితములైన హరిదయాలుని నుడువులు పిడుగుల వడువున చంద్రనాధుని తలపై పడెను! తూలుచు నతఁడు మెల్లగ మెట్లనుండి పైకరుదెంచెను! నోటినుండి వెల్వడురోదన స్వరము నత్యంతకష్టమున నడ్డుపెట్టి అయ్యతన మునఁ గొంచెకవడి అట్టులే నతమస్తకుఁడై నిలువంబడి "అయ్యా! ఎంత—కాలమైనది?" అని రుద్ధస్వరమున చంద్రనాధుఁడు దయాలు నుద్దేశించి పలికెను.

ఎంతకాలమేమి?—దేనిని గుఱించి అడుగుచున్నారు?"

ఈయసంపూర్ణ వాక్యముతో చంద్రనాధుని దురంతదుఃఖపూర మొక్కసారి చివాలున బైకుబికివచ్చెను. రోదనసర్వమున నాతఁడు "ఏమి? నా అర్ధాంగి—ఎప్పుడు—మరణించెను" అని దయాలుని ప్రశ్నించెను.

దయాలుఁ డబ్బురపడి ఆమె మరణింపలేదు! ఇంకను భూమిమీఁదనే యున్నది" అని జబా బొసఁగెను.

చంద్రనాధుని హృదయభారమించుక తగ్గెను. "అయ్యా! ఆమె ఎచట నున్నది!" అని యాతురమున నాతఁ డడిగెను

"ఈశ్వరదాసుయింట నున్నది."

"ఆ యిల్లెచట!"

"ఈకనఁబడు సందుచివర నున్నది. ఇంటిముందు ఒకటి రెండరటిబోదెలు కనఁబడుచుండును.

కపాలము గట్టిగఁ బట్టుకొని చంద్రనాథుఁడు మరల నేలపై చతికిల పడిపోయెను. చాలసేపటివఱకు కాతఁ డేమియుఁ బలుకఁ జాలక పోయెను. మనసు నించుక కుదుట పఱచుకొని "ఆమె యిచట ఎందులకు లేదు?" అని యాతఁ డడిగెను.

ప్రశ్న సామాన్యమైనది కాదని హరిదయాలుఁడు గ్రహించెను. ఊరక బిడియపడుట లేల యని యోచించి, "కట్టుకొనిన ఆఁడుదానను మీరే మీయింట నుండనీయ నప్పుడు పెఱవాఁడను నేనేల నుండనిత్తును? తోడి జాతివారితో తిరుగని దే నాకొక దినము గడచుట దుర్ఘటము." అని యించుకంతైన సంశయింపక హరిదయాలుఁ డనెను.

అతఁడు వచించినది నిక్కమని చంద్రనాథుఁడు గ్రహించి, యించుక తడసి "ఈశ్వరదాసుయింటి కామె ఎట్లరిగెను?" అని ప్రశ్నించెను.

"ఆతఁ డచటి కరుదెంచి, వెంటబెట్టుకొని పోయెను."

"అతఁ డెవరు!"

"బ్రాహ్మణుఁడు—నిరుపేద; చాలకాలమునుండి కాశీలో వసించుచున్నాడు"

"లలిత మొదటినుండి ఆతని నెఱుఁగునా?"

"బాగుగ నెఱుఁగును"

"ఆతని వయసెంత?"

వృద్ధుఁడైన హరిదయాలునకు నవ్వువచ్చెను. కాని అతఁడా నగవును బైకిఁ దోపనీయక, "అతని వయసు రమారమి

అఱువ దేండ్లుండును. లలితను 'అమ్మా!' అని అతఁడు పిలు
చుచుండును" అనియెను.

"ఆయింట నింక నెవరెవ రున్నారు?"

"ఈశ్వరదాసు, ఒకదాసి, లలిత, విశూమాత్ర ముండిరి."

"విశూ ఎవరు?"

"లలిత బిడ్డ"

చంద్రనాథుఁడు లేచి నిలువంబడి "సెలవు" అనెను.

అడ్డుబెట్టక సమూలుఁడు "మంచి" దనెను.

యువకుఁడు మెల్లగ నవ్వొలికరిగి, ఎదుటనున్న సందు గుండా కొంతదూర మరిగి "ఈశ్వరదాసుగారి ఇల్లెచ్చట నున్నదో ఎఱుఁగుదువా?" అని అచట నిలిచిన ఒకని నడిగెను. అదే! అని యూతఁడంగుళి నిర్దేశించి ఆగృహముఁ జూపెను. జంకులేక తిన్నగఁబోయి చంద్రనాథుఁ డాయింటఁ బ్రవేశించెను. సమ్ముఖమున నెవ్వరును లేరు, చావడిలోమాత్రము గుమ్మడిపండువలెనున్న ఒక పసిపిల్లవాఁడొకమూల నాడుకొనుచు నతనికంటఁ బడెను. చంద్రనాథుఁడు బాలకుని చివాలున లేవనెత్తి గాఢానురాగ పురస్సరముగ తన యక్కునఁ జేర్చుకొని లోపలఁ బ్రవేశించెను. శిశువు విస్మయమును గాని భయమును గాని చూపలేదు. అపరిచితుల కడకు చనువునఁ జేరుట తనకు క్రొత్తగాదని బాలుఁడు వ్యక్తీకరించెను. చంద్రనాథుని నాసికపై తన లేతచేయి వైచి, వానిమోము తేఱి చూచి "నువ్వు ఎవరవు?" అని బుడుతఁ డడిగెను.

గభీరాను రాగమున చంద్రనాథుఁడు బాలకుని ముఖమును పలుమాఱు చుంబించి, "నేను అయ్యను!" అనియెను.

"అయ్యవా?"

"అవును తండ్రీ! నువ్వో?"

"నేను వితును!"

కోటునుండి వ్రేలాడు బంగరుగొలుసును గడియారముతోఁ దీసి కొమారుని గళమందువైచి జేబులందు లభించిన పైకము, కలము, కాగితము మున్నగువస్తువుల నన్నిఁటిని వెలుపలికిఁ దీసి వాని నాతఁడు బాలకుని చేతులందుఁ బెట్టెను. ఇఁక మిన్నగ తనయున కొసఁగుటకు ఆతనిచేతుల కప్రేమియు దొరకలేదు.

ఒక్కమాఱుగా చాల వస్తువులను బడసి బాలకుఁడు పుల కితుఁడై "అయ్యా! నావే!" అనెను.

కొడుకు చిన్నిమోవిని జాననమున నిడికొని ప్రేమరసము తొలుకాడ ముద్దిడుకొని "అయ్యా! నీవే!" అని చంద్రనాథుఁ డనెను.

పరిచారిక యపుడు కిటికీగుండా వాకిలి లోనికిఁ దొంగి చూచెను. దొరవేషమున వ్యక్తి యొకఁడు బాలకునెత్తి ముద్దాడుట చూడఁగనే ఆమెగుండె దడదడలాడఁ దొడఁ గెను. నిముసమైన నందు నిలువక ఒకదాటున పోయి ఆమె వంటగదిలోఁ బడెను. ఈశ్వరదాసు నేఁ డింటలేడు. చాలకాల మైన పిదప విశ్వేశ్వరునకు దుగ్ధాభిషేకము సేయ ఆలయమున

కరిగెను. లలిత యంతకుమున్నే మందిరమునుండి మరుగిడివచ్చి వంటఁ జేయుచుండెను. వగర్చుకొనుచు వచ్చి, పరిచారిక "అమ్మా! అమ్మగారూ!" అని కేకవైచెను.

దాసి తత్తఱపాటున కబ్బురపడి లలిత "ఏమే! ఏమిజరిగినది?—ఎందులకా కేకలు?" అనెను.

"అమ్మా! ఎవరో దొరగారు మనయింటిలో ప్రవేశించి, అబ్బాయిగారి నెత్తుకొని సావిడిలో నున్నారు!"

లలిత అచ్చెరువొంది "ఏమి?—దొరగారా" అని అవ్వలికిఁ దొంగిచూచెను. కాని అందుండి ఆమె కెవ్వరును దృగ్గోచరము కాలేదు.

పరిచారిక వెనుకనుండి ఆమె వలువలాగి "అమ్మో!—అమ్మగారూ! వెళ్లకండి—తాతగారిని రానీయుండి" అనెను.

లలిత దాసి పలుకులను పాటింపలేదు. తనయింట దొరయొకఁడు చొచ్చుటేల యని యబ్బురపడి అది నిక్కమై యుండదని ఆమె సంశయించెను. అందుచే సాహసించి ఆమె ముందునకరిగి మఱుఁగునుండి చావడిలోనికి దొంగి చూచెను. పరిచారిక వచించినది మిథ్యకాదు. దొరవేషమున నొకవ్యక్తి పచారము చేయుచు, చంకనున్న బాలకునితో అస్పష్టస్వరమున ప్రసంగించుచుండెను. ధైర్యముఁ దెచ్చుకొని, ఆమె వాతాయన సమీపమున కరిగి తనదృక్కుల నవ్వలఁ బఱపెను. నీడను విలోకించి యంతనే ఎవ్వని నామె గుఱుతింపఁజాలెడిదో నిమేషమాత్రమున వానిని లలిత గుర్తుపట్ట కలిగెను!

పులకిత శరీరయై చివాలున నారాయణమూర్తి చావడిలోఁ బ్రవేశించి, గళసీమకంచలిఁ జుట్టికొని ప్రాణపతి చరణకమలములపై నొసల యిడి నిస్తురభక్తి పురస్సరముగ ప్రణామమాచరించి ఆతని పాదరజము నిజమస్తకమునఁ దాల్చి నతవదనయై నిలువం బడెను.

"ప్రేయసీ!" అని యనురాగావేశమున చంద్రనాథుఁ డర్ధాంగిని నిజబాహు మృణాలములందు బంధించి వైచెను.

౧౭

సతీపతులు చాలసేపు ప్రసంగించుకొనిరి చంద్రనాథుడు మిగుల కృశించిపోతివి.

మాతేమియు పలుకక లలిత పతిముఖమున మధురావలోకనములు పఱపెను. తోడ్తోడనే ఆతొయ్యలి ముఖపుండరీకమున హాస రేఖ మెఱసెను! "నిష్ఠురుఁడా! కృశించుటం దబ్బురమేమున్నది!" అని యాచిరునగవు చెప్పక చెప్పెను. తదుపరి చంద్రనాథుఁడు కుమారునితోఁ గాలక్షేపము చేయఁ దొడఁగెను. బుడుతని మోడియం దిడికొని లలిత వాని చిన్ని మేజోళ్లను, ముఖమల్ కోటును, పట్టుయంగీని ఒక్కొటొకటిగ విప్పివైచి, వీవనతో విసరి, తడిగుడ్డతో వానికాళ్లులు తుడిచెను. నందనుని పరిచర్య నిత్యకర్మగా దలంచుచు, సకాల

మున వానిని నెఱపుట కితరపనులు నామె వెనుక బెట్టుచుం డును. ఈజీవనమున నెవ్వరిని మరలఁ జూడఁ గలుఁగు నాస లేకుండెనో నాతని దర్శనలాభము నేఁటికి చేకూఱినపుడు కూడ నిట్టూర్పులును, అంగలార్పులును అవిరళముగ వెల్వడ లేదు. లలిత వాని కించుకంతైనఁ జోటీయలేదు. అనుదినము హృదయేశుఁడు తనచెంత కరుదెంచు చున్నట్లును, నేఁడు మాత్ర మాతనిరాక కించుక విలంబమైనట్లును, నెంచులీల నామెలనాగ యాచరించెను!

కాని చంద్రనాథుని యాచరణ వేఱురీతిగఁ జూపట్టెను. అర్ధాంగిని వదలి సమయమంతయు అతఁడు తనయునితో నతి వాహిత మొనరింప నడఁగెను. బాలకుఁడు తక్క బుద్ధిమంతు లైన అన్యులెవ్వరును గృహమందు లేరు. ఉన్నట్లైన, చంద్ర నాథుఁడు తనంతకుఁ దాను పట్టుబడి, తనయొప్పుచు గప్పిపుచ్చు కొనుటకై ఒండుదెసగ మోముఁ ద్రిప్పక, ఏమియు నెఱుఁగని వానిలీల బుడుతనితో నాడుచుండెనని గ్రహింపఁ గలిఁగి యుందురు.

నాయనా! ఇఁక ఆఁడు కొనుటకై అవ్వలకుఁ బొమ్ము" అని తల్లి తనయుని బురికొల్పెను.

జనని యానవిని, బాలకుఁడు తల్పమునుండి చివాలునఁ గ్రిందికి లంఘింపఁ బోయెను. పుత్రునపుడు చంద్రనాథుఁ డాదరపురస్సరముగ మెల్లగఁ గ్రిందికి దింపెను. ఇంతకు మున్ను జనని జనకునకు ప్రణామ మాచరించుటఁ జూచినవాఁడు

కావున, శయ్యనుండి దిగినంతనే చివాలున తండ్రి చరణములకు బ్రణాయమిల్లి బాలకుఁ డవ్వలికిఁ బర్వెత్తెను. కొమారుని బట్టుకొనుటకై చంద్రనాథుఁడు చేయిఁజాచెను కాని డింభకుఁ డాదీర్ఘ బాహువున కందలేదు.

అనురాగపురస్సరముగ లలిత పతిహృదయమునఁ జేయి వైచి "శరీరము కేవల మస్థిపంజరమై యున్నది.—ఆరోగ్యము చెడినదా యేమి?" అనెను.

"లేదు. కుశలముగానే యుంటిని."

"అట్లైన బెంగటిల్లి యుంటిరి కాఁబోలు!"

చంద్రనాథుఁడు (అర్ధాంగి యాననముఁ దేఱిచూచి)—నీవేమని యూహింతువు?

ఉత్తరమొసఁగక, ప్రసంగముమార్చి "ప్రొద్దెక్కినది—స్నానముకై లెండు" అని లలిత యనెను.

చంద్రనాథుఁడు— ఈయింటి యజమాని ఎచట?

"నేఁ డాతడు పూజచేయుటకై విశ్వేశ్వర మందిరమున కరిగెను. సంధ్యానంతరమునఁ గాని రాఁడనుకొనెదను."

"అతనిని నీవేమని పిలుతువు!"

"చిన్నతనమున "పెదబాబయ్య' అని పిలిచెడి దానను—ఇపుడుకూడ అట్లే పిలచుచుంటిని"

చంద్రనాథుఁ డింకేమియుఁ బ్రశ్నింపలేదు.

"మీా కూడ నింకను ఎవరెవరు వచ్చిరి?"

"హరి, మధు యిద్దరు వచ్చిరి. వారు స్టేషనుయొద్దనున్న

బంగాళాలో నున్నారు.

లలిత—(స్మితముఖియై) వారి నిచటకుఁ దీసికొని వచ్చుటకు సాహసము కలుఁగలేదు కాఁబోలు!

చంద్రనాథుఁ డామాట కుత్తర మొసఁగలేదు.

*　　*　　*　　*

స్నానమాచరించి, చంద్రనాథుఁ డొకచో సుపవిష్టుఁడు కాఁగనే పళ్లెరమున మిష్టాన్నమిడి లలిత దాని నాతనిముందుల నుంచెను. చంద్రనాథుఁ డది గాంచి అబ్బురపడి అప్రసన్నుఁడై పళ్లెరమును ప్రక్కకుఁ ద్రోసివైచి "ఇదేమి ఎందులకు దీని నిందుంచితివి—పరిహాసమునకా, లేక మఱెందులకైననా!" అనెను.

లలిత అప్రతిభయై పోయెను—మలినముఖియై "భుజింపరా!" అని యామె యడిగెను.

క్షణకాలము చంద్రనాథుఁడు పత్నియొక్క ముఖముఁ దేఱిచూచి "ఈసమయమున నే నెన్నఁడైన మిఠాయిఁ దిని యుంటినా!" అని ప్రశ్నించెను.

పాపము లలితకేమి యొనరించుటకుఁ దోఁచలేదు. ఆమె యంతరంగ మాందోళనముచే నిండిపోయెను. నిర్విణ్ణయై నీరవయై ఆయనవద్ద అట్టులే నిలువంబడి పోయెను.

చంద్రనాథుఁడు—పతి కాహార మొసఁగుటకు నీకిది వేళ యెందటిమాటయు కాదు. నాకేమేమి యిష్టమో నీవు మఱువలేదను కొందును.

లలిత కన్నులనుండి అశ్రుధారలు స్రవించుచుండెను. ఆసుఖ దినములు గడచిపోయెను గదాయని తలంచుకొనుచు, ఆమె వాపోవుచుండెను. దుఃఖసంవరణ మొనరించుకొని, మెల్లని స్వరమున నామె "అన్నముతిందురా? కాని—" అని ఏమో యనఁబోయి, ఆమె యట్లె యిన్నకుండెను.

"కాని యేమి?—చల్లారిపోయినదా యేమి?"

"లేదు—అన్నమిప్పుడే వార్చితిని"

"ఇఁక సంశయమేల?"

లలితఁ (ఇంచుక తడసి)—నేను వండినది ముట్టుదురా?

చంద్రనాథుని యాశలు ఆకస్మికముగ ఆనతమై పోయెను. తన యర్ధాంగి తనకు వేఱాయెననియు, ఆమె స్పృశించిన అన్నముఁ దాను భుజింపరాదనియు ఇంతకనుక ఆతఁడు మఱచెను. లలితమాట యశనిపాతమట్లు ఛిన్నవిచ్ఛిన్నమైన ఆతని హృదయమును తాకెను. చాలసేపటి వఱకు చంద్రనాథుఁడేమియుఁ బలుకఁజాలక పోయెను. పదంపడి నతమస్తకుఁడై, యాతఁడు "లలితా! మిట్టమధ్యాహ్నమున నాకన్నులందు అశ్రుధారలను జూడకున్న, నీకు తృప్తి కలుగదా?" అని దీనస్వరమునఁ బలికెను. లలిత తత్తఱమున లేచి, "పోయి అన్నముఁ దీసికొని వత్తును." అని తోడనే యామె వంటగది లోనికరిగెను. ఎంత యడంచుకొన్నను ఆమె కన్గవలనుండి యశ్రుసలిలము అవిరళముగ స్రవింపఁ దొడఁగెను! చేలాంచలిచే నెన్నోమాఱులు తుడుచుకొనెను. ఎన్నోసార్లు ముఖ

ప్రక్షాళనము గావించుకొనెను. తుదకు కొంతవఱకు బిగబట్టుకొని అన్నవ్యంజనముల నామె అతనిపాలికిఁ గొంపోయెను. నతవదనయై పెనిమిటి చెంగటఁ గూర్చుండి బహుకాలమునకు మున్నువలె ఆదరానురాగములు తేటపడ నాపయికలి పతికిఁ గుడువఁబెట్టి, ఎంగిలిఁ దీసివైచి, మఱొకమాఱు స్వేచ్ఛగ కన్నీరు గార్చుటకు వంటయిలు జొచ్చెను.

రెండుగంటలై పోయెను. జనకుని యూరుతలమున పన్నుండి బాలకుఁడు హాయిగ నిదురవోవుచుండెను. లలిత అపుడు పతి యొద్ద కరుదెంచెను.

చంద్రనాథుఁడు—ఇంటి పనులన్నియు ముగిసినవా?

"ఇంటి పనులేమియు లేవు—పెదబాబయ్యగా రింకను రాలేదు."

తదుపరి లలిత సంసారగోష్ఠియందుఁ బడిపోయెను. ఇల్లు వాకిలి, ఎట్లున్నదనియు, ఇంటియందలి సామగ్రి ఎట్లున్నదనియు గ్రుచ్చి గ్రుచ్చి ఆమె యడిగెను. పదపడి హరకాళీ వ్రజకిశోరులను గుఱించియు, మణిశంకర హరిబాలలను గుఱించియు, దుఃఖపూర్వకముగఁ దన్ను వారణాసిపురమున విడిచిపోయిన వృద్ధపరిచారకుని గుఱించియు, ఇరుగుపొరుగు వారిని గూర్చియు, చెప్పనేల తా నెఱిఁగిన ప్రతివారిని గుఱించి ఒక్కరొక్కరిని వేర్వేఱ పేర్కొనుచు, నెల్లవారిక్షేమ మరయుచు నెప్పటి చనువున పతి నామె ప్రశ్నించెను. పత్ని పరమసంతోషమున ప్రశ్నిం

చుచుండెను.—పతి అనిర్వచనీయోత్సాహమున ఉత్తరమొసంగుచుండెను. గాఢస్నేహబద్ధులైన నెచ్చెలు లిర్వురు దురదృష్టావశాత్తు వడివడి, తునకు ఒకరినొకరు కలిసి కొనినట్లు వారు మెలంగం దొడగిరి.

కొండొకవడి ఆత్మవిస్మృతయై, విగతసంసార విషయముల నడిగి యడిగి హఠాత్తుగ నామె "క్రొత్తయత్తవారి దేయూరు!" అని పతిని ప్రశ్నించెను.

అది కేవలము పరిహాసగర్భితమైన ప్రశ్నయని యూహించి చంద్రనాథుండు "కలకత్తాకు విశేషదూరములేదు—కొలది గంటలలో వారియూరుం జేరుకొనవచ్చును" అని యుత్తరమొసంగెను.

"నూతనవధువు ఎట్లున్నది!"

"సరిగ నీవలెనే!"

లలిత హృదయ మపుడు దుర్వారవ్యథచే విచ్ఛిన్నమైపోయెను. పాపమామె ఆ వేదనమును సహింపంజాలక పోయెను. నిముసములో నామెముఖము వివర్ణమై పోయెను!

అర్ధాంగి శోచనీయావస్థ విలోకించి, చంద్రనాథుండు తొట్రుపడి, పానుపునుండి చివాలునం క్రిందికి లంఘించు నంతలోనే యామె చివాలున చతికిలబడి యచేతనయై వడి నేల కొరిగెను. చంద్రనాథుం డామెతోం గూడ నేలగూలి అర్ధాంగి యుత్తమాంగమును అంకతలమునం జేర్చుకొని, ఆక్రందనస్వరమున "లలితా! లలితా!!" అని పిలచెను.

లలిత ఒకమాఱు కన్నులు తెఱచి అశ్రుసిక్తమైయున్న హృదయేశుని ముఖ మొకమాఱు విలోకించి, మరలఁ గన్నులు మూసికొనెను! చంద్రనాథుని హృదయకవాటము పగిలిపోఁ దొడఁగెను. అవిరళోద్గతాశ్రుధారల రాల్చుచు ఆతురపు చూడ్కుల నామె మ్లానముఖమున నిక్షేపింపఁ దొడఁగెను. లలిత యోష్ఠాధరము లొకమాఱు కంపించెను. అస్పష్టస్వరమున నామె యేమియో వచించెను; కాని ఆ నుడువులు శ్రుతిగోచరము కాలేదు.

గడగడ వడఁకుచు నీటికొఱకై చంద్రనాథుఁడు బొబ్బలిడ సాగెను. అనతిదూరమందున్న పరిచారిక నీరుగొని చివాలున నా శయనాగారముఁ బ్రవేశించెను. కాని లక్ష్మి యేమియుఁ దొట్రుపాటు వ్యక్తీకరింపలేదు. "బాబూ! కంగారు పడకుఁడు ఇప్పుడే తెప్పిరిల్లును. ఇట్లు అపుడపుడు జరుగుచునే యుండు" నని ఆమె చంద్రనాథునితోఁ బలికెను.

పదంపడి లక్ష్మియు చంద్రనాథుఁడును లలిత ముఖమున సలిలసేచన మొనరించి, వీవనతో విసరి వలయుసేవ సల్పిరి.

కొండొకవడికి లలితకు చైతన్యము కలిగెను. లజ్జితయై అవగుంఠనము సవరించుకొని ఆమె లేచి కూర్చుండెను. లక్ష్మి తనపనిమీఁద తాను పోయెను. చంద్రనాథుని ముఖమంతయు నల్లవడి యుండెను.

క్షీణమధురమందహాసము వదనమండలమునఁ దోప లలిత "భయపడితిరా?" అని ప్రశ్నించెను.

చంద్రనాథుని కన్నులు రెండును అశ్రుపూరితములై పోయెను. గండభాగములనుండి స్రవించు బాష్పధారలను దుడిచివైచుకొని, "అంతయు ముగిసె ననుకొంటిని" అని యాతఁడనెను.

"మీయంకతలమున నట్టి యదృష్టమీ హతభాగిని కేల కలుఁగలేదు?" అని యంతరంగమున తలపోసి "ఇట్లు అప్పుడప్పుడు అగుచుండును!" అని ప్రకాశముగఁ దెలిపెను.

"ఈపాడురోగము ఈవటిలో నుండెడిది కాదు. ఇంటి నుండి యిచటికి వచ్చినపిదప సంప్రాప్తమైనది కాఁబోలు" అని చంద్రనాథుఁడు విచారాయత్తచిత్తుఁడై చాలసేపేమేమో తలపోసెను. పదంపడి జేబునుండి వెండిబీగములగుత్తి ఈవలికి దీసి లలిత వసనాంచలికి దానిని గట్టివైచి "ఇదిగో! నీగుత్తి నీవు తీసికొనుము—భద్రమని చెప్పి నాయొద్ద విడిచి వచ్చితివి. నేఁడు మరల నీబీగములను నీకు ఒప్పగించి వైచితిని. నీవు యిచటి కరుదెంచిన పిదప ఎప్పుడైన వానిని దీసితినేమో పరీక్షించుకొమ్మా" అని చంద్రనాథుఁడనెను.

తన కతిప్రియమైన ఆగుత్తిఁ గైకొని "ఆమె కేల యిచ్చి తిరికారు?" అని లలిత యనెను.

చంద్రనాథుని శుష్కమ్లాన ముఖమున ఆకస్మికముగ పవిత్రహాసరేఖలు ప్రకాశించెను. వాని నడంచుకొనుచు నతఁడు "లలితా! ఆమెకే యిచ్చితిని" అని యుత్తర మొసఁగెను.

పతివచనము లలిత కంతగ బోధపడలేదు. సందిగ్ధదృష్టు లను క్షణకాలము జీవితేశుని ముఖమున నిబద్ధమొనరించి మృదుస్వరమున "మీనూతనవధువును గురించి చెప్పితిని.— బీగములగుత్తిని మీ క్రొత్తపెండ్లామునకే లయిచ్చితిరి కారు?" అని లలిత ప్రశ్నించెను.

చంద్రనాథుఁ డీక హృదయావేగము నడఁచుకొనఁజాలక పోయెను. అత్యంతప్రణయ పురస్సరముగ బాహుద్వంద్వమున ప్రాణేశ్వరి బంధించివైచి "ప్రేయసీ! ఆమెకే యొసఁగితిని!— పత్నులు నా కిరువురులేరు, ఒకర్తుకయే!" కాని ఆమె నాకు ప్రాతకాలేదు—చిరకాలము నూతనమై యుండును! ప్రథమ మున నామె నీ కాశీక్షేత్రమున విశ్వేశ్వరప్రదత్త ప్రసూనము కైవడి పరమపరితోష పూర్వముగఁ గైకొనినపు డామె యెట్లు నూతనమై యుండెనో నేఁ డామెను విశ్వేశ్వరుని చరణతలము నుండి అనంతానురాగ పురస్సరముగ మరల నాహృదయపీఠ మున గైకొను పవిత్రసమయమునఁ గూడ నట్లే నూతనమై యుండెను." అని కౌఁగిటిలో పులకిత గాత్రియైన అర్ధాంగి నుద్దేశించి ప్రాప్తలాభ ముదితహృదయుఁడై చంద్రనాథుఁడు పలికెను.

*           *           *           *

సంజదీపము వెలిగించి బాలకుని అంకతలమం దిడికొని, పతిపాదములచెంత కూర్చుండి ప్రియుని యడుగుల నొత్తుచు నిట్లనెను "పెదబాబయ్యగారిని చూడకుండ మీరు పోరాదు.

ఈరాత్రికి మీ రిందుండవలెను."

"యోచింతును.—దానును దర్శింపవలె ననియేయున్నది."

లలిత చాలసేపటినుండి పతితో నేమియో పలుకవలెనని యనుకొనుచుండెను. కాని బిడియముచే నట్లు వచించుటకామె సాహసింపకుండెను. ఎట్టకేల కించుక ధైర్యముం దెచ్చుకొని "మీకడ సిగ్గేల!—" అని ఏమో యనఁబోయెను కాని మరలఁ దొట్రుపాటున నేమియుఁ బలుకఁ జాలక పోయెను.

అర్ధాంగి చెప్పునది వినవలెనని చంద్రనాథుఁడు కౌతుకమున నామెవంకఁ జూడసాగెను.

లలిత—మీకొకజాబు వ్రాయవలెనని యనుకొంటిని—

"ఏల వ్రాసితివి కావు?—నేను నిషేధించి యుంటినా!"

"మీరు కోపగింతురేమోయని భయపడితిని—మరల మీ రెప్పుడిచటికి వత్తురు?"

"నీవు రమ్మనినపుడు వత్తును."

సమయముం దెలుపవలెనని లలిత యూహించెను కాని, అట్లు తెలిపిన ప్రయోజనము లేదని పరక్షణమందే ఆమె గ్రహించెను. మానవశరీరములు బుద్బుద ప్రాయము లనియు దానంజేసి తాను చెప్పఁదలఁచిన తోడనే చెప్పక పతి పునరాగమనమునకై తడసిన యెడల, దన యుద్దేశము తనయందుండగనే ఈలోపున విగతజీవయై తాను మన్నుఁ జేరునేమో యన్నియు తలపోసి "మీకడఁ దెలుపుటకు నాకు బిడియమేల?" అని తనయభిప్రాయము వ్యక్తీకరింప గడంగెను.

"అవునది నిక్కమే!—చెప్పఁ దలఁచినదేమో చెప్పివే యుము. ఊరక సంశయించెద వేల?"

నాకిఁక బ్రదుకుపై వాంఛలేదు.—ఈరీతిగ దినములు గడపుట బాగుగఁ దోఁచుటలేదు. ఎందులకీ పాడు బ్రదుకు?"

ఇవి పరిహాసవాక్కులు కావని చంద్రనాథుఁడు గ్రహించెను. ఆతురమున నాతఁడర్ధాంగి ముఖమును దేఱిచూచెను. ఆమె యాననము మరల వివర్ణమై పోయెను.

"జరుగఁ దలఁచినదేమో జరిగి పోయెను. ఇపుడు నాసర్వ స్వమును గోలుపడి యైనను, నీకారోగ్యము వడయఁజేతును." అని ప్రకాశముగఁ బలుకక, చంద్రనాథుఁ డంతరంగమున ననుకొనియెను.

"ప్రార్ధన యొకటి కలదు.—దానిని మన్నింతురా?" అని వినీతస్వరమున లలిత మరల పలికెను.

"అదేమో తెలుపుము."

"నాకొఱకై నేనేమియుఁ గోరుచుండుట లేదు.—నామరణ వార్త మీచెవులఁ బడినపుడు (అని తనయుని తండ్రిపాదముల చెంతఁ గూర్చుండబెట్టి) ఒకమాఱిచటికి వచ్చి ఈబిడ్డను దీసికొని పొందు బిడ్డనికై మిమ్మిట్లు వేఁడుచుంటిని."

విపుల యావేగమున చరతలమునుండి చంద్రనాథుఁడు తనూభవుని నిజవక్షతలమునకుఁ దీసికొని వాత్సల్యపురస్సరముగ పలుమాఱా బుడుతనిమోముఁ జుంబించెను గాని పత్ని కేమియు నుత్తర మొసఁగ లేదు.

అపు డవ్వాలనుండి ఈశ్వరదాసు "దాదా! విశూ!!" అని కేకవై చెను.

జనకుని హృదయపీఠమునుండి విశ్వేశ్వరుఁడు చివాలునఁ గ్రిందికి లంఘించి "దాదూ! దా!! దాదూ! దా!" అని అవ్వలికరిగి పితామహుని బిలిచెను.

"పెద బాబయ్యా వచ్చె" నని లలిత పానుపునుండి దిగి నిలువంబడెను.

బాలకుని యురమం దిడికొని ఈశ్వరదాసు ప్రాంగణములోని కరుదెంచెను.—ఆగారమునుండి చంద్రనాథుఁడు కూడ అచటి కరుదెంచెను. ఈశ్వరదాసు ఈవఱలో నెన్నఁడు చంద్రనాథుని జూచి యుండలేదు. చూచియున్నను గుర్తింపఁ జాలకనే యుండును. ఏమియుఁ బలుకక వృద్ధుఁడా నూతన వ్యక్తిపై విస్మయదృష్టులు పఱుపసాగెను.

పితామహుని ఉన్నతోదరమున నుపవిష్టుఁడై యున్న డింభకుఁడు చిరుచేయి తండ్రిదిక్కుగఁ జూపి "దాదా! అయ్య అదుగో!" అని ముదుసలికి జనకుని పరిచయము కలుఁగ జేసెను.

చంద్రనాథుఁడు వృద్ధుని పదములకు ప్రణమిల్లెను.

"నాయనా! చిరంజీవివి గమ్మ" అని చంద్రనాథుని చరణములనుండి లేవనెత్తి "తండ్రీ! రమ్మ" అని ఆనందపురస్సరముగ నీశ్వరదాసాతని నాలింగన మాచరించుకొనెను.

ఆరాత్రి గడచిపోయెను. మఱునాఁడు ఇష్టాగోష్ఠి గొంతప్రొద్దు పుచ్చిన పిదప చంద్రనాథుఁడు దాసు నుద్దేశించి "మామయ్యగారూ! రేపు మీ అమ్మాయిని, మనుమని ఇంటికిఁ దీసికొని పోవుదును. అనుమతి యొసఁగెదరని నమ్మెద" ననియెను.

ఆమాట వినినంతనే శతాధికశిరంగు లొక్కమాఱు ప్రేలినట్లు వృద్ధుని హృదయపంజరమున నొక భీషణనిర్ఘోష ముత్పన్నమయ్యెను. ముదుసలి ఏమో యుత్తర మొసఁగెను కాని, అది ఆతని చెవులఁ బడలేదు. "ఇంతకంటె కావలసిన దేమి నాయనా!" అని మాత్రము బహుదూరమునుండి అస్ఫుట స్వరముతో నెవ్వరో యనినట్లు చంద్రనాథునకుఁ దోఁచెను.

లలిత ఆవార్త విని, ఆనందము ప్రకాశింపలేదు. ఆమె కనుదామరలనుండి అశ్రువారి ప్రవహింపఁ జొచ్చెను. నిజేశుని పదయుగళమున నుత్తమాంగ మిడి "ఈ పవిత్రపాదధూళి ఇంచుక నాకు ప్రసాదించి, ఈ హతభాగిని నిందే విడిచి యుంచుఁడు. నాకొఱకై ఏల సంఘచ్యుతు లగుదురు!" అని వినీతస్వరమున లలిత పలికెను.

"ఊరక బేలవు గాకుము. ఇదివఱకే యిట్టి భయమునకుఁ జోటిచ్చి ఘోరాఘము సల్పితిని—ఇప్పుడు కన్నులు తెఱచితిని."

పతి పలుకులకు లలిత ఏమియు ప్రత్యుత్తర మొసఁగఁ జాలకపోయెను—ఊరక బేలయై ఆమె వాపోవఁదొడఁగెను. వృద్ధుఁడైన దాసు కాతరముఖము తన కన్నీటియందుఁ దేలి యాడుచున్నట్లు ఆమెకుఁ జూపట్టెను.

చంద్రనాథుఁడు—లలితా! నే నొనరించిన ఘోరదురితము మన్నింపుము. గతమును విస్మృతించి, నా గృహము చక్క-బఱచుము. చిరకాలము ప్రయాగక్షేత్రమున నొంటరినై ఆశ్రమవాసము సలుపలేను. బిడ్డను విడిచి ఇఁక నిమసమైన నుండఁజాలను.

లలిత మరల పతి పదధూళి శిరమునఁ దాల్చెను. ఏమేమో యుత్తర మొసఁగ నామె గమకించెను. గాని భాష్పగద్గదమైన ఆమె గళమునుండి ఏమాటయు వెలువడలేదు.

మఱునాటి ప్రాతఃకాలమున నీశ్వరదాసు ఎప్పటియట్లు మనుమని జంకఁ బెట్టుకొని, ఒకచేతఁ జదురంగపు బరణి గైకొని శంభునాథుని యింటి కరిగెను. ప్రముదితచిత్తుఁడై మిత్రుఁడు వృద్ధుని నాహ్వానించెను. నెచ్చెలి నుద్దేశించి దాసు "శంభూ! నేఁడు సుదినము. విశూ! దాదా నేఁడు తన యింటికి వెడలిపోవును. పెద్దవాఁడై నాఁడు కదా తమ్ముఁడూ! గుడిసె యం దిఁక వానిని పడవైచి యుంచుట మంచిపని కాదు."

వార్త విని శంభునాథుఁడు మిగుల నానందించెను.

చదరంగపుపీటమ్రోల నుపవిష్టుఁడై, ఈశ్వరదాసు నిర్దిష్ట స్థానములందు సేనలను సన్నాహ మొనరించి, "భాయీ!

నేఁడు మన మిర్వురము ఆనందింపవలసిన దినము—మంచి యెత్తులు రెండు వేయుదము రమ్ము" అని నెయ్యలిని బిలిచెను.

కాని, ఆట మొదలిడిన అచిరకాలములోనే దాసు వరుస వరుసగఁ దన జంతువులను గోలుపోవఁ దొడఁగెను. ఏనుఁగు చచ్చినంతనే, శకటు, శకటము పట్టువడినంతనే గుఱ్ఱము కూలి పోయెను. బలసంపన్నములైన జంతువుల యుద్ధాయింపులను ప్రతిఘటింపవలసిన బంటులు గూడ మున్ముందుగనే పట్టు వడెను.

ముదుసలి క్రొత్తయాటవైఖరికి శంభునాథుఁడు విస్మయ పడి "బాబాజీ! నేఁడు నీమతి ఏలనో పోయిన ట్లున్నది. ఆడు చుంటివి కాని ఏమి చూచుచుంటివో గుఱుతింపఁ జాలకుం టివి!" అనియెను. క్రమక్రమముగ జంతువు లన్నియు చచ్చి రాజు కట్టుబడిన పిదప ఈశ్వరదాసు చతురంగయుద్ధము చాలించి జంతువుల నన్నిఁటి నొక్కటొక్కటిగఁ దీసి బరణి యందు వైచెను. కాని ఎఱుపురంగు మంత్రినిమాత్ర మందుఁ బడ వేయక అతఁడు బాలకుని కరమం దిడి, "దాదా! మంత్రిని నీకు అచ్చముగా ఇచ్చివేసినాను. ఇకెప్పుడు నువ్వు దానిని నా కివ్వనక్కఱలేదు" అనెను. ఇంటికి మరలిపోవునప్పుడు మార్గమధ్యమునఁ గానంబడిన పరిచితు లందఱికి ఆతఁడా సువార్తఁ దెలుపఁ దొడఁగెను.

అన్నిపనులందును నేఁడు వృద్ధుని అధికోత్సాహము ద్యోతకము కాఁ దొడఁగెను. కాని ఏపనిగాని అతఁడు సరిగ

చేయఁజాలకుండెను. చదరంగమందువలె నన్నిపనులందును పొరపాటులే చేయసాగెను. ప్రొద్దెక్కుకొలఁది, ప్రయాణపు వేళ సమీపించుకొలఁది, ముదుసలి పొఱపాటులు వృద్ధి కాఁ దొడఁగెను. వృద్ధుని మతిచాంచల్యము విలోకించి, లలిత తహతహపడుచు పలుమాఱులు కన్నీ రొడ్చెను. కాని అంత రంగమందలి యాందోళన మెట్లున్నను, దాసు ముఖమందలి యుత్సాహమించుకంతైనఁ దగ్గిపోలేదు. ఏకాంతమునకుఁబిలిచి లలిత వృద్ధునిపదధూళి నిజమౌళిఁ దాల్చి విలపింపఁ దొడఁగి నప్పుడు కూడ ఆత్మసంవరణ మొనరించుకొని నగుమోమున పుత్రిక నాశీర్వదించి ఆతఁ డిట్లనెను "తల్లీ! ఏడువకుము. వృద్ధుఁడైన నీ పెదబాబయ్య యాశీర్వాదఫలముగ నీవు మహా రాణివి కాఁ గలుఁగుదువు. అమ్మా! మరల నెప్పుడైన నీకాశీ క్షేత్రమునకు వచ్చునెడల, నీ యీపూరిల్లు మఱచి, మఱే చోటున గాని వసింపకు సుమీ!"

కన్న తండ్రికంటె మిన్నయై యున్న దాసు పలుకులు విని లలిత మఱింత వెక్కి వెక్కి యేడువఁదొడఁగెను. ఏనాఁడు అత్తింటినుండి వెడలఁగొట్టఁబడి, నిరాశ్రితయై, కాతరయై కాశీక్షేత్రమున కరుదెంచెనో, ఆనాఁడును నేఁడును పెక్కు సంతాపభావము లామె కోమలచిత్తమున గలంచి మిక్కిలి వేధింపఁ దొడఁగెను.

వ్యథితహృదయయై ఆమె "పెదబాబయ్యా! నన్ను వదలి నీ వుండఁజాలవు. అందుచే నా ప్రార్థన మన్నించి—"

ఆమె మాట కడ్డువచ్చి, దాసు "అమ్మా! ఇంక నెన్నిదినములు?" అని ప్రకాశముగఁ బలికి,—"ఈమాఱు ఆహ్వానము వచ్చినది. ప్రాణశకుంత మింక స్వేచ్ఛగ నెగసిపోఁగలదు. ఇన్నినాళ్లకు దేహపంజరమునుండి దానికి విడుదల కలుఁగుచున్నది" అని యంతరంగమున భావించుకొనెను.

గండభాగములందు జాలువాఱు కన్నీటి నంచలిచేఁ దుడుచుకొనుచు ఆకులభావమున లలిత "నిష్ఠురనై—"

అని ఏమో చెప్ప గమకించుచుండ నడ్డువచ్చి వృద్ధుఁడు "ఛీ! తల్లీ! అట్లనకుము— నేను నిన్ను గుర్తించితిని" అనెను.

రాత్రి పదిగంటల కంకణము స్టేషను కరుదెంచిరి. రైలు వచ్చువేళ క్రమక్రమముగా సమీపించెను.

విశ్వేశ్వరుఁడు నిద్రామగ్నుఁడై పోయెను. కాని ఎఱుపు రంగుమంత్రి నాతఁడు వక్షమున గట్టిగ బట్టుకొని యుండెను. వృద్ధుఁ డిటునటు ద్రిప్పి, నిద్రనుండి అతనిని మేల్కొలిపెను. కనులు తెఱచి బాలకుఁ డాక్రందన మొనరింపఁ బోయెను. గాని, ముదుసలి తన ముఖము చెంతకు మనుమని ముఖమును దీసికొని "విశూ! దాదా!!" అని పిల్వఁగనే,—"దాదూ!" అనుచు నతఁ డానందమున నవ్వసాగెను.

"దాదా! విశూ!! ఎక్కడికి వెళ్లుచున్నావు?"

"వెళ్లుతున్నాను" అని చేతనున్న మంత్రిని ముదుసలికిఁ జూపి "మంతిరి!" అని బాలకుఁ డనెను.

"అవును దాదా! మంత్రిని పోఁగొట్టుకోకుసుమీ!"

తా నిచ్చిన మంత్రివిషయమై ఇంతకుముందు కూడ పలుమాఱు వృద్ధుడు బాలకుని హెచ్చరించి యుండెను. మునసటి యీమాఱు హెచ్చరించినపుడు బుడుతడు "పోగొట్టుకోను—మంతిరీ!" అనియెను.

రైలు వచ్చినంతనే లలిత మరల వృద్ధుని పదధూళి కొదలదాల్చి పెట్టిలోనికెక్కి కూర్చుండెను. దాసు చెప్పిన యాశీర్వాచనము ఓష్ఠాధరములందు కంపించిపోయి లోపలనే ఉండిపోయెను.

రైలు వెడలుటకు విలంబము లేనప్పుడు వృద్ధుడు ఉరమున నాడుచున్న బాలకుని, దీసి బండిలోని చంద్రనాథుని చేతి కందించి "దాదూ!" అని డగ్గుత్తికతో పలికెను.

"దాదూ!"

"మంత్రి—"

మంత్రిని జూపుచు, పరమాహ్లాసమున బాలుడు "దాదూ! మంతిరి!" అని కిలకిల నవ్వసాగెను.

"పోగొట్టుకోకుమీ!"

"పోగొత్తుకోను దాదూ!"

వృద్ధుని చక్షులనుండి అశ్రువారి స్రవింపసాగెను. బండి కదలగనే లలితదాపున నున్న కిటికి చెంత కరిగి యతడు "అమ్మా! ఇక నుండిపోదును—" అని మఱొకమాఱు ఉచ్చైస్స్వరమున "బాబా! దాదూ!"—అని పిలచెను.

రైలు హోరునకు జన కోలాహలము తోడైనందున

బాలకుఁడా పిలుపును వినఁజాలకపోయెను. దృష్టినుండి శైలు బహిర్గతయై, దాని శబ్దము శ్రుతిగోచర మగుచున్నంతవఱకు ముందునకు ఒక్క యడుగైన వెనుకకు వేయక అనిమేషనయనుఁడై వీక్షించుచు నిలువఁబడి పోయెను. తదుపరి నిట్టూర్పు విడిచి ఈశ్వరదాసు మెల్లగ నిజాలయమునకు మరలిపోయెను.

## ౧౬

పత్నీ పుత్రులతో చంద్రనాథుఁడిల్లు చేరుకొనెను. ఆతని హృదయమందు శేషించిన భయము కొంచెము మణిశంకరుని మాటలు వినఁగనే అంతర్హితమై పోయెను. "నాయనా! ప్రాయశ్చిత్త మొనరించినయెడల పాపములు పటాపంచలగును. కాని కలుషవిహీనయైన కాంతకు ప్రాయశ్చిత్త మెందులకు? అట్లొనరింపవలెనని యూహించుట నుచితము. చేఁజేతులఁ ఆ నిర్మలాత్మ కీవఱలోఁ జేసిన అత్యాచారము చాలును. మరల అపచార మూని ఆ యనఘ కవమానము సలుపుటకంటె ఘోరమైన పాప మింకొకటి యుండదు" అనుచు చంద్రనాథుఁడు నిజాలయమునకు మగుడి వచ్చిన కతిపయదినములలో హరకాళి మున్నగువారి దుష్ప్రయత్నములను గుఱించి వినిన వృద్ధుఁడైన మణిశంకరుఁడు అన్న కొమరుని నుద్దేశించి పలికెను.

పినతండ్రి నోట నిట్టి మాటలు వెల్వడుట చంద్రనాథునికి మిగుల నబ్బురముగఁ దోఁచెను. ముదుసలి యందిట్టి వైఖరిని గాంచు భాగ్యమాతని కెన్నఁడుఁ గలుఁగలేదు. నేఁడది నూతనముగను వింతగను అతనికిఁ దోఁచెను.

మణిశంకరుఁడు మరల నిట్లు వాక్రుచ్చెను. "నాయనా! వృద్ధుఁడ నైతిని. నేఁటిదనుక నెన్ని సంసారములనో విలోకించి యుంటిని. ఒకవిధపు తప్పు గాకున్న మఱొకవిధమైన దోసమును గావింపని సంసారము సంఘమందు లేదు. తన దీర్ఘ జీవనపథమున మానవుఁడు చాల దూరము సాగిపోవలెను. ఆపథ మొక్కచో శంకిలమయ్యె, కొండొక తావున నున్నతమై మఱొక్కచోఁ గడు గభీరమై యుండును. అట్టి తెరువునఁ బట్టి చను పాంథుఁడు పదస్ఖలనమున నొక్కొకచో నేలఁ గూలఁ బడు టొక యబ్బురము కాదు. కాని ఆ తెరువరి తన పతనమును గుఱించి పలుకక ఒరుని పతనము గూర్చి ఘోషించును. తమ దోసఁగుల నణంచివైచుకొనుటకు వార లన్యుల దోషములను, అపరాధములను నలువలంకులఁ గుప్పితమతులై చాటుచుందురు. ఆ ఘోషమునఁ దమ చెడుగు లడఁగి యుండునని వా రాశపడుచుందురు. నాయనా! మఱొక నూతనవిషయమును గ్రహించితిని. ఒరులను దనవారిగను పెఱవారిగను గావించుకొనవచ్చును. కాని తనవారి నెవ్వరైన నెన్నఁడుఁ బెఱవారిఁ గావింపఁజాలరు! ఇంతకాలము నేను అంధుఁడనై యుంటిని—కాని విశూ ఇపుడు నాకన్నులు దెఱచెను! వాని

పుణ్యమున నందఱము పవిత్రుల మైతిమి ! నేఁడు ద్వాదశి—రాఁబోవు పూర్ణిమదినమున మనయింటికి గ్రామస్థుల నందఱను విందునకై యాహ్వానింతును. అన్న బ్రదికియున్నపుడు కలిసి మెలసి యుండి ఏపండువునైన, ఏశుభకార్యమునైన కడుంగడు వేడుకతోఁ గావించుకొనువారము. అతఁడు పరమపదించిన పిదప దుర్మతినై నిన్ను వదలి, బంగారువంటి నీ సంసారము బుగ్గిజేయఁ గలఁపడితిని. నాయనా ! నాతప్పు సైరింపుము. నేఁటితో నీకష్టము లన్నియుఁ దీఱినవి. నేను కన్నులు దెఱచితిని. అన్న యున్నప్పటివలె ఉత్సాహమునఁ గలసి మెలసి కతిపయదినములు గడుపవలెనని వాంఛించుచున్నాను. నాచేతి మీఁదుగ నేదేని యుత్సవము జరుపవలెనని వేఁడుక పడుచుంటిని. పూర్ణిమనాఁడు నా పుట్టింట మనుమనికి మరల నూతనముగ నన్నప్రాశనమహోత్సవము నెఱపవలెనని నా కోరిక !"

చంద్రనాథుఁడు (యించుక యోచించి)—కాని సంఘము విషయ మే మందును? వెలివెట్టిన వారు మన యింటికి విందారగించుటకు వత్తురా? తోడిజాతివారలు మనయిండ్లను త్రొక్కి చూతురా? ఈసంఘమును గుఱించి ఏమి యోచించితిరి?

మణిశంకరుఁడు (చిఱునవ్వుతో)—నాయనా! సంఘము పేర్కొనుచు అట్లు భయపడనేల? సంఘమెవరు?—సంఘమును నేను, సంఘము నీవు!—మనమిద్దరముతక్క ఈగ్రామమున సంఘమే మున్నది ? ఎవరికి అర్థమున్నదో వారు సమాజ

పతులు! నే నిచ్ఛగించినచో నిన్ను జాతిభ్రష్టుని జేయఁ జాలుదును; నీవు వాంఛించుచో నిముసములో నన్ను వెలివెట్టఁ జాలుదువు! సంఘము సంఘమని యిఁక ఆరాటపడకుము. మఱొకసంగతి చెప్పుచుంటిని. ఇంతకు ము న్నా విషయముఁ దెలిపియుండ లేదు. నేఁడు సాహసించుచుంటిని: రమాకాంతుని విషయము జ్ఞప్తియం దున్నదా?

"ఉన్నది. కాశీనుండి హరిదయాలుఁడు వానిని గుఱించి విపులముగ వ్రాసి యుండెను."

"మనకుటుంబమునకు సిగ్గుగాని ఎగ్గుగాని కలుఁగుచో వానిమూలమున మాత్రమే కలుఁగును! కాని నేను వానినోరు కట్టివేయించితిని. రెండేండ్లు పాపికి కఠినశిక్ష వేయించితిని. కొలఁది దినములక్రిందట మాత్రమే కైదునుండి విడుదలఁ బడసి అతఁ డెందో పలాయితుఁడాయెను. మేను ప్రాణమున్నంతకాల మా పలుగాకి ఈప్రాంతములం దడుగిడ సాహసింపఁడు!"

మణిశంకరుఁ డపుడు గత వృత్తాంతమంతయు విపులముగఁ దెలిపెను.

పదంపడి పూర్ణిమనాఁడు అన్నప్రాశనోత్సవమతివైభవమున జరిగెను. అయూరివారే కాక, చుట్టుప్రక్కల పల్లెల నుండి పల్వురకు దెంచి, సముచిత సంభావన తాంబూలములు గైకొని, కడుపార విందారగించిరి.

ఉత్సవమున పాల్గొనుటకై విచ్చేసినవా రెవరును "చిత్రము!

చిత్రము!" అని ముందున కరుదెంచిరి గాని వెలియనియు, సంఘమనియు, జాతియనియు, జెప్పుచు ప్రతికూలముగ మెలఁగ లేదు. మిథ్యాపవాదము వెల్లడి యాయెననియు అట్టి పుక్కిట పురాణములను, బూటకపు కథలను వెలిబుచ్చుట జమీందారుల నైజమనియు శాస్త్రవేత్తలందఱు వాక్రుచ్చి బహుమానము లందుకొనుటకై ముందడుగు వైచిరి!

కాని హారకాళి మాత్రము ఉత్సవమున పాల్గొనక, కాళ్లు కట్టివేసినట్లు పెనిమిటి నొకమూలఁ గూలవేసి, తనవంటఁ దాను గావించుకొనెను. అంతియెగాక, ఇఁక నా పాపుయాపున నుంఢమసి ఆమె నొక్కి వక్కాణించెను! "ప్రాణములు పోయి నను పోవుగాక, మతము మంటగలుపుకొని జాతిభ్రష్టుల మధ్యను, కులహీనుల నడుమను మేము మసలలేము!" అని ఆపవిత్రాంగన వాక్రుచ్చెను. ఆమె వచించినది ఉచితమనియు అనుచితమనియు యోజింపక, ఏఁబదిగాక నెలకు నూఱురూపాయలామె కుటుంబ భరణమునకై పంపఁ జంద్రనాథుఁ డేర్పాటుఁ గావించెను.

* * * *

ఉత్సవము నాఁటిరాత్రి చాలసేపటివఱకు జమీందారు గారి సౌధము నృత్యగీతావాద్యములతో మారుమ్రోగెను. బంధుమిత్రాదులతో నాఁటి వేడుకలందుఁ బాల్గొని నడిరేయి గడచినపిదపఁ జంద్రనాథుఁడు శయ్యాగారమునఁ బ్రవేశించెను. సర్వాలంకార విభూషితయై, రాజరాజేశ్వరి లీల నొప్పుచు,

నిద్రితుండైన నందనుని అంకతలమున నిడికొని హృదయేశుని రాకకై ప్రతీక్షించుచున్న లలిత పతి యరుదెంచినంతనే పరమపరితోషసంభరితమానస యయ్యెను.

కొండొకవడి పతీపతులు ప్రమోదప్రసంగమునఁ గాలముఁ బుచ్చిరి.

చంద్ర—ప్రేయసీ! చాలకాలము గడచిన పిదప నేఁడు మనమేకాంతమున సౌఖ్యలహరినిఁ దేలియాడుటఁ గాంచి నిశాకాంతుఁ డెట్లు నగుచున్నాడో చూచితివా?

లలిత ముఖబింబమునుండి మందహాస ద్యుతులు ప్రసరించి శారద చంద్రికలను గలసికొనెను. ఆనతవదనయై యామె పతి పాదముల నొత్తుచు "నాథా! నేఁటితో మనయార్తి సంతమ సమన్ముక్తమైనది. అదుగో! నభంబున శరత్కాలరాకాసుధా కరుఁడు మన యానందాగమనము నెట్లు చాటుచున్నాడో విలోకింపుము" అని మృదుమధుర మంజులోక్తులఁ బలికెను.

చంద్రనాథుఁ డాహ్లాదముఁ బట్టఁజాలక పోయెను. లావణ్యాంబుధియైన అర్ధాంగిని భుజవల్లరులందు బంధించి చిరలబ్ధ మధురాధరసుధాపానమున సౌమనస్య సౌఖ్యమందెను!

కూఁతుమనుమలను సాగనంపిన నాఁటిరాత్రి అల్లనఁదప్పటడుగు లిడుచు వృద్ధుఁడగు ఈశ్వరదాసు నిజగృహమునకు మరలి వచ్చెను. ప్రాంగణమందలి తులసీవేదికపై అపుడుకూడ దీపము జ్వలించుచుండెను.——కాని దానిని లెక్కసేయక నలువంకులనుండియు కాఱుఁ జీకటులు పర్వాపర్వాన వచ్చి ముదుసలియింటిని చుట్టుముట్టుచుండెను.కతిపయనిమేషముల ముందువఱకు ఆకుటీరము పల్కురతో కలకలలాడి, ఇపుడు నిర్మానుష్యమై పోయెను. దీపము మాత్రము అప్పటినుండి జ్వలించుచు, ఆర్తిఁ దెలుపుచుఁ గ్రమక్రమముగ క్షీణించి పోవుచుండెను! ఇఁక నిముసములో నది యంతమొంది పోవును.—— పయనము కాకమున్ను లలితయే ఆదీపమును పెట్టెను.

ముదుసలి లోనికేగి మెల్లగఁ పాన్పుపై నొరిగెను. అవసన్నమైన ఆతని నయనయుగము నిమీలితమై పోయెను! అపుడపు డెవరో కర్ణపుటములందు "దాదూ! దాదూ!!" అని పిలిచి నట్లయ్యెను. భరతరాజు తన హృదయమధ్యమున మృత్యువేదనముఁ బొగులుచు నోష్టము కంపింప క్షీణస్వరమున "వాణీ! రా రమ్మ!" అని వాపోవుచున్నట్లు వృద్ధుఁడు కలఁ గాంచెను.

ఉదయమే పర్యంకమునుండి లేచి, అవ్వలి కరుదెంచి, అల

వాటుచొప్పున "విశూ! దాదా!" అని కేకవైచి, పడంపడి జ్ఞప్తికిఁ దెచ్చుకొని నిట్టూరుపు నిగిడించెను!

అనంతరము చదరంగపుబరణిఁ గైకొని ఆతఁడు మిత్రుని యింటికి కరిగి "శంభూ! నా దాదాభాయి వెళ్లిపోయెను సుమీ!" అని నెచ్చెలిని గేకవైచి ఆతనికిఁ దెలిపెను.

దాదాభాయి యెడల నెల్లఱు నధికప్రేమ జూపుచుండెడి వారు. అతఁడు కాశీవీడి వెడలెనని విని శంభునాథుఁడు దుఃఖితుఁ డాయెను. ఆటకుఁ గూర్చున్నపిదప మిత్రులిర్వురు చతురంగమున తమతమ బలమును నిలిపిరి వృద్ధుని బలమును విలోకించి శంభునాథుఁడు "బాబూజీ! నీమంత్రి ఎందుంతర్ధాన మొందెను?" అని ప్రశ్నించెను.

దాసు—(దీర్ఘనిశ్వాసము వీడి)—శంభూ! దానిని దాదాభాయి పట్టికొని పోయినాఁడు. ఎఱుపురంగు మంత్రిపై వానికి మక్కువ మెండు.

అపుడు శంభునాథుఁడు తనకడ వేఱుగనున్న బరణినుండి మఱొక మంత్రినిదీసి రంగస్థానమున నిలిపెను.

ఇరువురు ఆట నారంభించిరిఁ కొలఁది నిముసములలో ముసలి యాటఁ కట్టుబడి పోయెను. శంభునాథుఁ డాతనితో చదరంగము చాలకాలమునుండి ఆడుచుండెను. కాని విశూ వెడలిపోయిన క్రిందటిదినమునను ఇప్పుడును గాక ఈవఱలో నెన్నఁడు వృద్ధునియాటఁ గట్టివేయఁ జాలకపోయెను. తన విజయహేతువు నవలీల గ్రహించి, అతఁడు "బాబూజీ! బుడు

తోడు పోవునప్పుడు తాతగారిమతిని గూడ వెంటగొని పోయి నట్లు తోఁచుచున్నది!'' అనెను.

శుష్కహాసరేఖ ముఖమునఁ దోఁచఁ వృద్ధుఁడ "రమ్ము! మఱొకఆట వేయుదము'' అని మిత్రునిఁ బురికొల్పెను.

ఇరువురును మరల చతురంగరణమునకుఁ దార్కొనిరి.

సమరాంక మధ్యమున వృద్ధుఁడు 'శగటు' తావు మార్చుచు "విసూ!" అనెను.

"బాబూజీ! 'విసూ' అనుచుంటి వేమి? నీవు తీసినది 'శగటు' కాదా?"

ఇరువురు అప్పుడు కడుపుబ్బ నవ్విరి.

శంభు—బాబూజీ! ఈయెత్తుతో నీ యేనుఁగును దును మాడుదును.

మరల వృద్ధుఁడు తన యేనుఁగుపై జేయివైచి, "దాదా! రావాలి! రావాలి! పోయె! పోయె!'' అని కేకవైచి, ఆతని రాకను ప్రతీక్షించుచు, ఇంచుకసేపు ఆట నాపివైచెను.— కడుంగడు కోమలమైన కాయమొండు తన యున్నతోదర ముపైఁ జివాలున పడునని ముదుసలి తడసెను. వృద్ధుఁడు తడయుట విలోకించి, మిత్రుఁడు "బాబాజీ! ఎంత యోచించి నను, నీ ఏనుఁగును బ్రదికించుకొనఁ జాలవు'' అనియెను. పరాకునుండి మరలి ముదుసలి "అవునోయీ! నిష్కారణ ముగ నాగజము మడియుచున్నది!'' అనియెను.

కతిపయ నిముసములలో ఆట ముగిసెను. శంభునాథుఁడు

విజయమందెను. కాని ఆతఁడు సంతసింపలేదు. "బాబూజీ! నీమతి చలించిపోయి యున్నది. మఱియొక దినమున శ్రద్ధగా నాడుకొందము" అనెను.

దాసు నిజాలయమునకు మగుడు నప్పటికి రెండు యామములు గడిచిపోయెను.—ఇంటియొద్ద విశూ లేడుగాన తొందరయేల యని అతఁ డనుకొన సాగెను.

మెల్లగ వృద్ధుఁ డిలుసేరుకొనెను.—పెరడునందుఁ గల పొట్లపాదునుండి లక్ష్మి కూరకై కాయలు కోయుచుండెను. నేఁ డీశ్వరదాసు స్వయంపాక మొనరించి, తనంత, దాను వడ్డించుకొని, ఒంటరియై అన్నముఁ గుడువ వలయును. నేఁ డాతఁ డిష్టానుసారముగఁ దిని లేవ వచ్చును. అత్రమేమియు లేదు. "ఇదికావలె నదికావలెను దాదా!" అని వేపుకుతినుట కిఁక విశ్వేశ్వరుఁడా తావున లేఁడు! కాని బాలకుని పీడనము గడచిపోయి నంతనే వృద్ధునిఁ యుత్సాహాము చల్లవడిపోయెను! ముదుసలి అల్లన వంటగదిలోఁ బ్రవేశించెను. గుప్పెడు బియ్యము, రెండు వంకాయలు, ఒకటిరెండు ములగకాడలు, ఇంచుకంత పప్పు ఆతని కన్నులఁ బడెను! వృద్ధుని కన్నుల నుండి చివాలున బాష్పస్రవంతులు ప్రవహింప సాగెను! రెండేండ్లనాఁటి సంగతు లొక్కటొక్కటిగ ఆతని మనోవీధిని ద్యోతకము కాఁ దొడగెను. పై పనులయందు దాసి తోడ్పడ ఆపు డిప్పటివలె నొంటరియై ఆతఁడు వంటఁజేసి కొనుచుండు వాఁడు. విశూ అపుడాతని యింటికి వచ్చి యుండను లేదు

అందుండి పోయి యుండనులేదు!

పెరడులో బాలకుఁడు కట్టుకొనిన చిన్ని గుడి పూజారిలేని కతన పాడుపడి యుండెను. ముసలి మెల్లఁగఁ బోయి ఆ దేవాలయమును బరీక్షించెను. ఆలయ మించుక శిథిలమై యుండెను. మంటపగర్భమున విశ్వనాథనిర్మితమైన మట్టి బొమ్మలు మూఁడు నాలుఁగుండెను. అంతియగాక పండులకు పిడతలును, నైవేద్యమునకై తేఁబడిన పప్పుబెల్లములును మందిరమధ్యమునఁ బడియుండెను. శిథిలాలయమును వృద్ధుఁడు నిజహస్తములతోఁ గొంతవఱకు బాగుచేసి, విచ్ఛిన్నమైన విగ్రహములను ఆలయగర్భమునఁ గానంబడిన బాలకుని పిల్లంగ్రోవియుఁ దీసి, పసిబాలుని పగిది వానిని గొంపోయి, తన పడకటింట భద్రముగాఁ గాఁపాడెను.

అపరాహ్ణసమయమున గంగారాముని గృహమున చతురంగసేనలు కూడుకొనెడివి. సంధ్యానంతరమున నెప్పటట్లు ఆటయందుఁ బాల్గొనుటకై వచ్చి పల్వురు గుమిగూడుచునే యుండిరి. కాని చతురంగమున నారితేఱిన చేయి యని ఇఁక ఈశ్వరదాసునకు మునుపటి పేరు లేదు. అపుడు ప్రతియాటయం దాతఁడు దిగ్విజయుఁడై యుండెను. ఇపుడో మొదటి యెత్తులోనే అతఁడు కట్టుఁబడుచుండెను. ఒకప్పుడు చేయిఁ బట్టుకొని ఆతని డాట నేర్పినవారిపుడు వృద్ధునకు ఎత్తులు తెలుపుచుండిరి. ఒకపు డెవరితోఁ బందెముఁ గట్టి నిముసములో నెగ్గుచుండెడివాఁడో నేడు వారు గర్వముతో అవలీలగ

నొకటి రెం డెత్తులలో ముదుసలి మాటను గట్టివేయుచుండెను.

మునుపటివలె నిప్పుడు కూడ వృద్ధునకుఁ జదరంగమున మక్కువఁ గలదు. కాని ఆటనేర్పు అంతరించిపోయెను. ఒకటి రెం డెత్తుల నాతఁడిం కను మఱువకున్నను, సమయమునకు పరాకుపడుచు పగతునకు లొంగిపోవుచుండెను. చతురంగ సమీాకము నద్వితీయుఁడ నని ఆతఁ డీవఱలో గర్వించుచుండు వాఁడు. నేఁ డాగర్వము బిడియము లోనికిఁ బరిణముగాఁ బరిణమించినది. శంభునాథుఁడు పూర్వ మట్లే ముదుసలితోఁ గలసి మెలసి యుండుచు, వృద్ధుని మానసికదురవస్థకు మిగుల జింతిలుచుండెను. ఇపు డాతఁడు ప్రతిద్వంద్వియై నిల్వక, దాసు మాటమునుముఁ గఠినసమయములలో నొకటి రెండు క్రొత్త యెత్తులు తెలుపుచు ఆతనికిఁ దోడుపడుచుండెను.

దాసుయింటియం దిపుడు శోకము బయలుదేఱెను. ముదుసలి మెడల లక్ష్మి మిగులఁ గుపిత యగుచుండెను. వృద్ధుని దుస్థితిఁ గాంచి, కన్నీరు వీడుచు నది, "బాబూ! నిద్రాహారములు విడిచివేసితి రే. ఒకసారి అద్దమందు మీా రూ పెట్లున్నదో చూచుకొనుఁడు" అని పలుమాఱు పలుకుచుండెడిది.

ఈశ్వరదాసు చిఱునవ్వుతో "బిడ్డా! ఏమి చేయుదు? వంట యంతయు మఱచిపోతిని—పొయ్యిలో నిప్పు వేయువిధమునే మఱచితిని" అని యనుచుండును.

లక్ష్మి చాలకాలమునుండి దాసు గృహమునఁ బనిచేయుచుండెను. కన్నకూఁతునువలె మెలఁగుచుఁ జేఁతోడు వా

దోడై వృద్ధుని కామె నిర్మలభక్తి పురస్సరముగ పరిచర్య చేయుచుండెను. దీర్ఘమనోవ్యాధికతన దాసు ఏమియుఁ దిన నొల్లక పడియుండు నవసరమునఁ జనవున నాతని నదలించి లక్ష్మి వాని దైనికయుపవాసములకు భంగముఁ గలుగఁజేయు చుండెను.

ఈవిధముగ నొక మాసము గడచిపోయెను.

పిదంపడి మూఁడు నాలుఁగు దినములు దా సెవరికినిఁ గానం బడలేదు. శంభునాథుఁ డాతుకఁడ్డై వృద్ధుని యింటి కరుదెంచి విచారించెను.

"అయ్యా! మా బాబుగారికి జ్వరము వచ్చినదండి" అని లక్ష్మి తెలిపెను.

శంభుఁడు ముందుసని గదిలోఁ బ్రవేశించి, పరుండియున్న మిత్రు నుద్దేశించి "బాబూజీ! ఉష్ణము తీవ్రముగా నున్నదా?" యని బలుకరించెను.

ఈశ్వరి—(మందహాస మొనరించి)—అవును తండ్రీ! పిలుపుకూడ వచ్చినది.

"శ్రీరామ! రామా!—బాబూజీ! అట్లనకుము. అచిర ములో నిమ్మళించును."

"నాయనా! ఇఁక నిమ్మదించు వయసు లేదు—ఈపర్యా యము పయనము కట్టవలెను."

"వైద్యు నెవరినైన పిలిపించితివా?"

దాసు (మరల నవ్వి)—ఏఁబదియెనిమిదవయేట, వైద్యుఁడు

వచ్చి మాత్రము ఏమి చేయఁగలఁడు తండ్రీ !

"బాబూజీ! ఈవయసునందే భయపడవలెనా? పరిపదులు దాటిన వారెందఱు లేరు?

ఈశ్వరదాసా ప్రశ్న కుత్తరమొసఁగక "శంభూ! శుభ వార్త ఒకటి నీతో చెప్పవలసి యున్నది. దాదాభాయి ఒక ఉత్తరము వ్రాసెను.—లక్ష్మీ! ఒకమాఱు కిటికీతీయుము. మనవానికి ఉత్తరము చదివి వినిపించవలెను." అని తలగడ క్రిందనుండి జాబొకటి పైకిఁ దీసి బహుక్లేశమున నాలేఖను మొదటినుండి తుదవఱకు జదివి మిత్రునకు వినిపించెను. హిందూస్థానీయుఁడైన శంభునాథున కందలి యంశములు కొన్ని బోధపడి, కొన్ని బోధపడలేదు.

ఆరాత్రి శంభునాథుఁడు వైద్యుని గొనివచ్చెను. చికిత్స కుఁడు స్వీయదేశస్థుఁడు, ఈశ్వరదాసుతో అతని కీవఱలో చాల పరిచయముండెను. అతఁడడిగిన ప్రశ్న లొకటి రెంటి కుత్తరము లొసఁగి "డాక్టరు బాబూ! దాదాభాయి ఉత్తరము వ్రాసినాడు. చదివెదను వినుఁడు" అని దాసనెను.

'దాదాభాయి'తో వైద్యునకు పరిచయములేదు. అందుచే "ఎవరి యుత్తరము?" అని యాతఁ ప్రశ్నించెను.

"ఎవరేమి?—దాదు, వినుఁడు!—లక్ష్మీ! దీపమొకమాఱు ఎత్తి పట్టుకొనుము"

దీపపువెలుతురున నతఁ డుత్తరమంతయుఁ జదివివైచెను. తాను చదువుచున్నట్టిది వైద్యుఁడు వినుచున్నదియు లేని

దియు ఆతఁడొకమాఱు తలయెత్తి యైనఁ జూడలేదు. లలిత చేవ్రాఁత, విశుజాబు—అవియే ఆతని సుఖము! ఔషధ మొసఁగి చికిత్సకుఁడు వెడలిపోయెను. శంభునాథుని ప్రక్క లోనికిఁ బిలిచి, విశ్వేశ్వరుని రూపగుణబుద్ధులను గుఱించి చాలసేపాతనితో ముదుసలి ముచ్చటింపఁ దొడఁగెను.

రెండువారములు గడచిపోయెను—కాని ఈశ్వరదాసు జ్వరము ఉపశమింపలేదు. పొరుగింటి బాలకునొకని బిలిపించి విశూకతఁడు తాను కుశలముగనే యున్నట్లును, ప్రస్తుత మారోగ్యమంత బాగులేకున్నను, ఆతురపడవలసిన యక్కఱ లేదనియుఁ దెలుపుచు నెల్లఱ క్షేమమరయుచు జాబు వ్రాయించెను.

ఈశ్వరదాసు మంచము పట్టెననియుఁ అతని బ్రదుకునం దిఁక ఆశలేదనియు విని చూచుటకై హరిదయాలుఁ డరుదెంచెను. ఒకటిరెండు ప్రశ్నల కుత్తరములొసఁగి ప్రక్కక్రింద నుండి జాబుఁ బైకిదీసి వృద్ధుఁడు దానిని దయాలుని జేతఁబెట్టి "బాబూజీ! చదువుము" అనియెను.

పత్రము మలినమై భిన్నమై యుండెను. అందలి యంశము లలిత స్పష్టముగ గోచరించుట లేదు. చదువఁ జాలిన విషయములను జదివి దయాలుఁడు "లలిత చేవ్రాఁత యనుకొనెదను" అనియెను.

"చేవ్రాఁత ఆమెదే యైనను, ఉత్తరము నాదాదా యుత్తరము."

"అవును. చివర అతని పేరున్నది."

దయాలుని నుదువు ముదుసలి కించుక పరిహాసముగఁ దోఁచ "బాబాజీ! దాదాసంగతి బాగుగ నీవెఱుఁగవు. అతనిని గుఱించి పరిహాసోక్తు లుచ్చరించు టనుచితము. అతని యుత్తరము, ప్రస్తుతము కన్నతల్లి వ్రాసినమాట వాస్తవమే! ఇఁక రెండు మూఁడేండ్లు గడచినయెడల, బిడ్డ తనచేతులతోఁ దానే వ్రాసికొనఁ గలడు" అని వాక్రుచ్చెను.

సమ్మతి సూచకముగ హరిదయాలుఁడు శిరము పంకించెను.

అమితోత్సాహమున నీశ్వరదాసు "బాబాజీ! చదివితివి గదా!—విశూరాత్రులందు 'దాదూ! దాదూ!!' అని పలవరించుచు ఏడ్చుచుండువాఁడు. ముసలి మనుమని అతఁడెట్లు మఱచి పోవును!—జాబు మఱొకమాఱు చదివి చూచుకొనుము. తాతయనిన బిడ్డకు పంచప్రాణములు!" అనియెను. వృద్ధుని గండభాగములనుండి రెండశ్రుబిందువు లప్పుడు రాలి పాన్పుపై పడెను.

లక్ష్మి సమీపమందే యున్నది. కనుసన్నచే దయాలు నామె నవ్వలకుఁ బిలిచి "అమ్మా! నీ విఁక ఇంటికి పొమ్ము. అట్లు కూర్చుంటివేని, ఆప్రసంగముతోనే ప్రొద్దు గడపి గ్రుడ్ల నీరు గ్రుక్కుకొనుచు మతిపోఁగొట్టు కొనును" అనియెను.

మఱి నాలుగైదు దినములు గడచిపోయెను. క్రమక్రమముగ దాసు శరీరస్థితి చెడిపోఁ దొడఁగెను. శంభునాథుఁడింటి దిక్కుగఁ దిరుగక రేఁ బవల్లు ముదుసలినిగని పెట్టుకొని అత

నికి వలయు శుశ్రూషలు సలుపుచుండెను. అప్పుడప్పుడు వైద్యుఁడు వచ్చి రోగిని జూచి పోవుచుండెను. నేఁడు పగలంతయు దాసు చైతన్యశూన్యుఁడై పడియుండెను, సంధ్యావంతరమున నించుక జ్ఞానము వచ్చెను. తనుపరి సగము మతితోఁ బడియుండెను. నిశీథమున "విశూ దాదా! ఏది నామంత్రి? ఈమాటు ఇయ్యి దాదా! లేకపోతే ఆటలో ఓడి పోవుదును!" అని యాతఁడు పలవరింపసాగెను. దాపున నుపవిష్టుఁడైయున్న మిత్రుఁడు "బాబూజీ! ఏమనుచుంటివి?" అని యాతని బల్కరించెను.

వృద్ధుఁ డొకమాటు కన్నులు తెఱచి చూచెను. తోడనే అధికాతురమునఁ దలగడక్రింద చేయివెట్టి ఏమో వెతుకసాగెను. అక్కఱకలుఁగు తఱి ఎంత వెతకినను తనకతిప్రియమైన వస్తువేదియో కానంబడకున్నందున, వేడి నట్టూర్పు విడచుచు రెండవప్రక్కకు మరలి "అయ్యో! ఏమయ్యెనో కదా! విశూ! దాదా! మంత్రి నొకమాటు ఇయ్యవా? మంత్రిని పోఁగొట్టుకొని ఇఁక నెంతసేపు ఆడుదునో నీవే చెప్పు దాదా!" అని ముదుసలి వాపోవఁ దొడఁగెను.

ఈ విశ్వచతురంగఖేలనమున ఈశ్వరదాసు ప్రాణములకన్న మిన్నయైన మంత్రి నొండు గోల్పోయి, కాతరస్వరమున దాని నొసఁగుమని విశ్వపతిని ప్రార్థించుచుండెను. దాపుననున్న శంభునాథుఁడు ముదుసలి మోమును బరీక్షించెను; లక్ష్మి దీపమును వృద్ధుని ముఖసమ్ముఖమునకు గొనివచ్చి

తేలిచూచెను. ఇరువుర ప్రాణములు ఎగసిపోయెను. దాను గ్రుడ్లు పైకి దిరిగిపోయెను! అప్పుడుకూడ ఓష్ఠాధరములు కంపించుచు "దా—దూ! మంత్రి—లేక—యింకొంత—సేపు—ఆడుదును?—ఇయ్యవా? దా—దూ! దా—దూ! దా—దూ!!! దా—" అని యుచ్చరించుచు స్థిరములాయెను.

* * * *

మఱునాఁడు హరిదయాళుఁడు చంద్రనాథునకు జాబు వ్రాసి పంపెను. అదిగాంచి లలిత చంద్రనాథులు దుఃఖమహార్ణవమున మునిఁగిపోయిరి. "దాదూ! దాదూ!" అని బాలకుఁడు రేఁబవలు లడల దొడగెను.

ఆనాఁటి నిశీథమందే ఈశ్వరదాసు ఈశ్వర సన్నిధానముఁ జేరుకొనెను.

సంపూర్ణము

